# ప్రజలతో సన్నిహిత సంబంధాలు పెట్టుకోవాలని సోవియట్ రచయితలకు కృశ్చేవ్ ఉద్బోధన



"సోవియట్ భూమి"

18వ సంచికకు అనుబంధం 28 సెప్టెంబరు, 57

సోవియట్ భూమి, 18వ సంచికకు అనుబంధం, 28, సెప్టెంబరు 1957.

# ప్రజలతో సన్నిహిత సంబంధాలు పెట్టుకోవాలని సోవియట్ రచయితలకు కృశ్చేవ్ ఉద్బోధన

## "కేవలం తిండికోసం కాదు" అనే నవల పాక్షిక దృష్టితో వ్రాసినది

*మే 13న జరిగిన రచయితల సభలోనూ, మే 13న సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ, రచయితలకూ, చిత్రకారులకూ, శిల్పులకూ, వాగ్గేయకారులకూ చేసిన సన్మానం లోనూ, గత జూలైలో జరిగిన పార్టీ కార్యకర్తల సమావేశంలోనూ నికటా కృశ్చేవ్ చేసిన ప్రసంగాల సంక్షిప్త పాఠం కొత్తగా వెలువడిన "కమ్యూనిస్టు" అనే పత్రిక 12వ సంచికలో, "సాహిత్యం, కళలకు ప్రజాజీవితంతో సన్నిహిత సంబంధం" అనే శీర్షికతో ప్రచురింపబడింది.*

కమ్యూనిజం నిర్మాణానికి జరిగే దేశ కృషిలో సారస్వతం కళలు ఒక అంతర్భాగమని లెనిన్ ఉపదేశాన్ని అనుసరిస్తూ కమ్యూనిస్టు పార్టీ, సాహితీవేత్తలు, చిత్రకారులు, శిల్పులు, వాగ్గేయకారులూ, తదితర సంస్కృతీ సేవకులందరి కార్యకలాపాలకూ సర్వదా అత్యధిక ప్రాముఖ్యతనిస్తూ వచ్చింది, అన్నారు కృశ్చేవ్. సోవియట్ ఆర్థికాభివృద్ధిని గూర్చి ప్రసంగిస్తూ కృశ్చేవ్, ఆర్థిక నిర్వహణలో ప్రస్తుతం జరుగుతున్న పునర్వ్యవస్థీకరణవల్ల సోవియట్ ప్రజలకు కేవలం భౌతికమైన లాభాలే కాక, యితరత్రాకూడా చాల లాభముంటుందని తెలియ జేశారు. సాంస్కృతిక శక్తులు మరింత సక్రమంగా పంపకమవుతాయి కాబట్టి అది సాంస్కృతిక వికాసంలో నూతన పురోగతికి దారి తీస్తుంది; ఆర్థిక ప్రాంతాల కేంద్రాలు మరింత త్వరితగతిని సాంస్కృతిక కేంద్రాలుగా అభివృద్ధి అవుతాయి. "పరిశ్రమలు, నిర్మాణంలో నిర్వహణ పునర్వ్యవస్థీకరణ" గురించి తన నివేదిక ప్రచురించబడిన తరవాత, కొందరు రచయితలు దేశ జీవితంలో జరుగుతూన్న నూతన పరిణామాలను అర్థం చేసుకోలేక పోయారు; అత్యంత తక్షణావశ్యకమైన పారిశ్రామిక నిర్వహణాభివృద్ధిని తెచ్చిపెట్టిన ప్రస్తుత ఆర్థిక పరిస్థితిని సక్రమంగా అంచనా వెయడానికి సిద్ధపడలేదు, అన్నారు కృశ్చేవ్. వారిది ఎంతవరకు తప్పో యీ కామ్రేడ్స్‌కు త్వరలో జీవితమే వెల్లడిస్తుందని మా విశ్వాసం అన్నారాయన.

వ్యవసాయంలో సాధించబడిన విజయాలగురించి, గతంలో దాని పురోగతికి అడ్డు తగిలిన హంగాల గురించీ ముచ్చటిస్తూ కృశ్చేవ్. సాహితీవేత్తలూ, కళాకారులూ, సోవియట్ పరిపాలనా కాలంలో యూనియన్ రిపబ్లిక్కులలోని వివిధ జాతుల వారి జీవితంలో వచ్చిన మహత్తర చరిత్రాత్మక పరిణామాలను రమణీయంగా చిత్రించ లేదింకాను. ప్రజల దైనందిన జీవితంతోనూ, పనితోనూ సన్నిహిత సంబంధం ఏర్పరచుకోవడం ద్వారా రచయితలూ, కళాకారులు సోవియట్ ప్రజల గురించి బూజుపట్టిన భావాలను వదిలించుకో గలుగుతారు; వారి స్వభావాన్ని, ఆలోచనలనూ, ఆశలనూ అర్థం చేసుకో గలుగుతారు; నవలల్లోనూ, కథల్లోనూ, పద్యాలలోనూ, నాటకాలలోనూ ఫిల్ములలో, చిత్రాలలోను, సంగీతంలోను తమ సమకాలికుల నిండైన పాత్రలను చిత్రించ గలుగుతారు.

### సిద్ధాంతమూ, ఆచరణ

పార్టీ, ప్రభుత్వ, ఆర్థికాభివృద్ధి రంగాలలో గత కొద్ది సంవత్సరాలలో, పార్టీ అమలు జరిపిన చర్యలు, పార్టీ కార్యకలాపాలు సిద్ధాంతం ఆచరణల అభేద్య సమ్మేళనం మీద—యిది స్టాలిన్ జీవితపు చివరి సంవత్సరాలలో విచ్ఛిన్నమైంది—ఆధారపడి వున్నాయని నిరూపిస్తున్నాయని కృశ్చేవ్ అన్నారు. తాము మార్క్సిజం లెనినిజాలకు ఉపదేశకులమనీ, భాష్యకారులమనీ అనుకుంటూ, నిజానికి లెనినిజంకు దూరమై, పార్టీయొక్క ప్రజలయొక్క మూల ప్రయోజనాలకు వ్యతిరేకంగా విచ్ఛిన్నకర

ముఠా కార్యకలాపాలలోకి దిగజారిపోయిన కొందరు వ్యక్తులకు యిది అర్థంకాని విషయంగా కనిపిస్తుంది. మాలెంకోవ్, కగనోవిచ్, మోలటోవ్, షెపిలోవ్‌ల పార్టీ వ్యతిరేక ముఠాను సైద్ధాంతికంగా ఓడించి, పార్టీ 20వ మహాసభ నిర్ణయించిన లెనినిస్టు విధానానికి వ్యతిరేకులుగా వారిని బహిరంగం చేసిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ జూన్ ప్లీనరీ సమావేశం నిర్ణయాలకు పార్టీ, సోవియట్ ప్రజలూ యెంతో హర్షించారు.

పెద్ద సిద్ధాంతవేత్తలవలె నటించే కొందరు వ్యక్తుల గూర్చి నాకు తెలుసు. కాని వారి సిద్ధాంత "జ్ఞాన" మంతాకూడా సందర్భం వున్నా లేకున్నా, మార్క్సిజం-లెనినిజం ఉద్గ్రంథాల నుంచి వాక్యాలు నుపహరిస్తూ గారడీ చెయ్యడం తప్ప మరేంకాదు. సిద్ధాంత వేత్తలమని చెప్పుకుంటూ అటువంటి అవివేక పండితులు, రాజకీయాలలోనూ, శాస్త్ర విజ్ఞానంలోనూ, కళలలోనూ పాల్గొనగలగడానికి ముందు మనుషులకు మొదటి తిండీ, బట్టా యిల్లూ వుండాలన్న ముఖ్యమైన మార్క్సిస్టు సత్యాన్ని యింకా గ్రహించలేక పోతున్నారు. ప్రజలు అధికారాన్ని ముఖ్యంగా తమ చేతుల్లోకి తీసుకున్నది సాధ్యమైనంత త్వరగా ఉత్పత్తి శక్తులను అభివృద్ధి చేయడానికీ, సాంఘిక సంపదను యెక్కువ చెయ్యడానికీ, తమ జీవన ప్రమాణాన్ని పెంపొందించడానికీ, మంచి జీవన పరిస్థితులను సృష్టించడానికేనని యీ వితండవాదులు మరచిపోతున్నట్టున్నారు.

## సామ్యవాద భావాల ఆకర్షణ

సోవియట్ దేశమూ, చైనా ప్రజా రిపబ్లిక్కూ, తదితర సామ్యవాద దేశాలన్నీ సాధించిన ఘన విజయాలు, సామ్యవాదానికి శత్రువులైన వారిమీద గట్టి ప్రభావం చూపుతూ, వారిని గందరగోళంలోకి దించుతున్నాయి. అన్ని దేశాలలో సామ్యవాద భావాల ఆకర్షణశక్తి పెరగడానికి ఈ విజయాలే కారణం. సామ్యవాద సిద్ధాంత వ్యతిరేకులు యీ భావాలకు పారలౌకిక శక్తి నొకదానిని ఆపాదిస్తున్నారు. ఇందువల్లనే వారొక్కొక్కప్పుడు, మనమెవ్వరం వెళ్ళని ప్రాంతాలలోని కొన్ని పరిణామాలకు మనల్ని బాధ్యులుగా యెంచుతున్నారు. మహత్తర సామ్యవాద పరిణామాల సారాంశాన్ని అర్థం చేసుకోవడం, పరిశీలించడం, సరిగ్గా వాఖ్యానించడం మన సిద్ధాంతవేత్తల అతిముఖ్య కర్తవ్యం, అన్నారు కృశ్చేవ్.

మన దేశానికీ, సామ్యవాద శిబిరమంతటికీ వ్యతిరేకంగా దుష్ప్రచారం సాగించడంద్వారా సామ్యవాద శత్రువులు తమ హేయమైన లక్ష్యాల సాధనకై వ్యక్తిపూజా విమర్శను వినియోగించుకునేందుకు ప్రయత్నించారు అన్నారు కృశ్చేవ్. శాంతి, ప్రజాసామ్య, సామ్యవాదాలకై పోరాడే యోధులలో కలవరం పుట్టించడానికీ, మార్క్సిజం-లెనినిజం భావాల పలుకుబడిని తగ్గించడానికీ, సామ్యవాద శిబిర దేశాల ఐక్యతను భగ్నం చేయడానికీ ప్రజల దృష్టిలో కమ్యూనిస్టు పార్టీలను అప్రతిష్ఠపాలు చేయడానికీ, వాటిని దూషించడానికీ వారు చాల తాపత్రయపడ్డారు. సామ్యవాద శత్రువుల యీ నీచ కుతంత్రాలన్నీ ఘోరంగా విఫలమైనాయని యిప్పుడు ప్రతివారికీ సువిదితమే.

## మెదడుకు మేత

ఇంతకు ముందెన్నడూ లేనంత తీవ్రంగా కొనసాగుతున్న సిద్ధాంత పోరాటంలో సోవియట్ మేధావులు రాజకీయంగా పరిపక్వతపొందినవారుగానూ, మార్క్సిజం-లెనినిజం భావాలపట్ల దృఢ విశ్వాస విధేయతలు గల వారిగానూ నిరూపితమయారని చెబుతూ కృశ్చేవ్, వారిలో కొందరు, వ్యక్తి పూజా ధోరణివల్ల కలిగిన దుష్పరిణామాలను అధిగమించడానికి జరిగే కృషిలో వుత్పన్నమైన అనేక క్లిష్టమైన సిద్ధాంత సమస్యలను అంచనా వేయడంలో కదిలిపోతున్న అనిశ్చిత ప్రాతిపదికమీద నిలబడ్డారని అన్నారు. స్టాలిన్ వ్యక్తి పూజా ధోరణిపట్ల పార్టీ విమర్శ సారాంశాన్ని కొందరు కామ్రేడ్స్ తప్పుగా అర్థం చేసుకుని ఒక్క కోణంనుండి మాత్రమే దానిని పరికించడంవల్ల ఇది జరిగింది. మన పార్టీ జీవితంలోనూ, దేశ జీవితంలోనూ స్టాలిన్ గుణాత్మక పాత్రను పూర్తిగా త్రోసిపుచ్చడంగా యీ విమర్శను వ్యాఖ్యానించడానికి వారు ప్రయత్నించారు; సామ్యవాద నిర్మాణంలో యీ దేశం సాధించిన చరిత్రాత్మక విజయాలను విస్మరిస్తూ, సామ్యవాదం సాధనకు మన ప్రజలు సాగించిన పోరాటం చరిత్రలో చెడ్డవిషయాలనూ, పొరబాట్లను మాత్రం వేరుచేసి ప్రత్యేకంగా చూపించే తప్పుడు పద్ధతిని వారనుసరించారు.

తన కార్యకలాపాల చివరిదశలో స్టాలిన్ చాల తప్పులు చేశారు, కాని ఆయన మనదేశానికీ, మన ప్రజలకూ, సమస్త అంతర్జాతీయ కార్మికోద్యమానికీ లాభదాయకమైన సేవ చాల చేశారు కూడాను, అన్నారు కృశ్చేవ్.

వ్యక్తిపూజా ధోరణికి వ్యతిరేకంగా సాగిన పోరాటం సాహిత్యం, కళలపై చూపిన ప్రభావం గురించి కృశ్చేవ్ వివరించారు.

వ్యక్తిపూజా ధోరణిపై విమర్శ, సిద్ధాంత రంగంలో దాని దుష్ఫలితాలను అధిగమించడం—యిది సహజంగానే సృజనాత్మక కళాసేవకుల, ముఖ్యంగా రచయితల మనసులలోగాఢంగా చొచ్చుకుని పోయింది. అది వారి మెదడుకెంతో మేతనిచ్చింది.

## వ్యక్తిపూజా ధోరణి దశ

అది రచయితలు, చిత్రకారులు, శిల్పులు, వాగ్గేయకారులు తదితర కళాసేవకులకు అతి కష్టదశ అయింది, అన్నారు కృశ్చేవ్. రచయితలలో పార్టీకి, కేంద్రకమిటీకి, తత్ఫలితంగా స్టాలిన్‌కు సన్నిహితంగా వున్నవారు మరింత గట్టిగా దెబ్బతిన్నారు. అంటే అర్థం వారు ప్రజలకు, మన పార్టీ నాయకత్వాన ప్రజలు చేసిన ప్రతిదానికి సన్నిహితంగా వున్నారన్నమాట. ఈ రచయితలు తమ రచనలలో పార్టీ యొక్క, ప్రజల యొక్క పోరాటాన్ని వారి విజయాలనూ వాస్తవికంగా, చిత్తశుద్ధితో వర్ణించారు. ఈ రచనలలో స్టాలిన్ పాత్ర చాల తరచుగా కనిపిస్తుంది. ఈ రచయితలు మంచిపనే చేస్తూవుండేవారు. వారు మన పార్టీ శ్రేయస్సును కాక్షించారు. పార్టీ నాయకత్వాన తక్కిన ప్రజలతోబాటు కమ్యూనిస్టు మహాదాశయాలకోసం పోరాడేరు. అయితే కొన్ని సాహిత్య గ్రంథాలు, కళాఖండాలలో స్టాలిన్ వ్యక్తిత్వం గురించి పాక్షికంగా మాత్రమే చిత్రించబడింది; అవి పార్టీ యొక్క, ప్రజలయొక్క పాత్రను తగురీతిని చిత్రించలేక పోయాయి; ఆయన సద్గుణాలను అపరిమితంగా ఎక్కువచేసి చెప్పేయి. దీనంతటికీ, వ్యక్తిపూజా ధోరణి దశలో మొత్తం పరిస్థితే కారణం.

వ్యక్తిపూజా ధోరణిపై విమర్శ ప్రారంభమైనప్పుడు కొందరు రచయితలు, గతంలో చేసిన తమ సృజనాత్మక కృషి అంతా చాలవరకు తప్పు అని అనుకున్నారు. ఇంతకుముందు సామ్యవాద నిర్మాణంలో తాము చురుగ్గా పాల్గొనక పోయినప్పటికీ కొందరు మేధావులు, పార్టీ నాయకత్వాన సోవియట్ ప్రజలు సాధించిన విజయాలను కీర్తించిన సాహితీవేత్తలనూ, కళాకారులనూ అపమానించడం, దూషించడం మొదలుపెట్టేరు. వారు, "వెల్లవేసేవాడు" అనే పదం సృష్టించి, దానిని ప్రచారంలోకి తెచ్చి, మన జీవితాన్ని, ప్రజల నిర్మాణ కృషినీ, వారి ఘనవిజయాలనూ వాస్తవికంగా చిత్రించిన ప్రతివానికీ యీ చెడ్డపేరు పెట్టేరు.

సిద్ధాంత కృషికి సంబంధించిన ప్రధాన సమస్యల గురించి రచయితలతోనూ, కళాకారులతోను పార్టీ, ప్రభుత్వ నాయకులు చర్చలు, స్నేహపూరిత సమావేశాలు జరపడం అతి ప్రయోజనకర మైనది, అన్ని విధాల ప్రోత్సహింపదగినది.

## ప్రజాజీవితపు వాస్తవిక చిత్రీకరణగా కళ

సారస్వతం కళలూ సిద్ధాంత కృషిలోనూ, ప్రజల కమ్యూనిస్టు బోధనలోనూ అతి ముఖ్యపాత్ర నిర్వహిస్తున్నాయి కాబట్టి వాటికి సంబంధించిన సమస్యలపట్ల పార్టీ చాలా శ్రద్ధవహిస్తూందన్నారు కృశ్చేవ్. సారస్వతం కళల్లో విదేశసిద్ధాంత ప్రభావాలు చొరబడడాన్ని, సామ్యవాద సంస్కృతికి వ్యతిరేకంగా వాటి ప్రయత్నాలనూ పార్టీ తీవ్రంగా వ్యతిరేకిస్తూంది.

సాహిత్యమూ కళల అభివృద్ధికి ముఖ్యంగా అవసరమైనదేమిటంటే, అవి సర్వదా ప్రజల జీవితంతో ముడిపడివుండాలి; బహుముఖ సామ్యవాద కార్యకలాపాలన్నిటిన్నీ యథార్థంగా చిత్రించాలి; సోవియట్ ప్రజలు సాగించే మహత్తర పరివర్తనా కృషినీ, వారి ఉదాత్తమైన ఆశలనూ, ఆశయాలనూ, వారి ఉన్నత నైతిక ప్రమాణాలనూ రమణీయంగా, వాస్తవికంగా వర్ణించాలి. సామ్యవాదాన్ని నిర్మించడంలో మరింత ఘనవిజయాల సాధకనకై పాటుపడేందుకు ప్రజలను సమీకరించడం సారస్వతం కళల అతి ముఖ్యమైన సాంఘిక కర్తవ్యం, అన్నారు కృశ్చేవ్.

అయితే ఒక్కొక్కప్పుడు దిక్కుతెలియక, సరియైన మార్గంనుంచి తప్పి, సారస్వతం కళల లక్ష్యాలకు తప్పుడు వ్యాఖ్యానమిచ్చే రచయితలూ, కళాకారులూ యింకా కొందరున్నారు అన్నారు కృశ్చేవ్. కేవలం లోపాలను వెదకడమూ మంచి విషయాలేవీ చూడకుండా కళ్ళు మూసుకుని, జీవితంలోని చెడ్డ విషయాలను మాత్రమే, అప్రియ విషయాలను మాత్రమే చాలవరకు తీసుకోవడమూ సారస్వతం కళల లక్ష్యమని యీ వ్యక్తులు నిరూపించడానికి ప్రయత్నిస్తున్నారు. అయితే, మంచి విషయాలూ, జీవితంలో నూతనమైనవీ, అభ్యుదయకరమైనవీ అయిన విషయాలే త్వరగా పురోగమిస్తున్న సామ్యవాద సమాజ మూల సత్యం.

## ఆరోగ్యకరమైన విమర్శ అవసరం

కమ్యూనిస్టుపార్టీ సర్వదా ఆరోగ్యకరమైన విమర్శనూ, ఆత్మ విమర్శనూ ప్రోత్సహించిందనీ, యీ రెంటింటినీ నిర్మాణాభివృద్ధిని ఎక్కువ చేయడానికి గట్టి సాధనాలుగా వుపయోగించిందనీ చెబుతూ కృశ్చేవ్ యిలా అన్నారు: విషయాలను విమర్శిస్తున్నది ఏ దృక్పథంతో, ఏ లక్ష్యం కోసం అనేది ముఖ్యం. మన పనిలో లోపాలను తొలగించడానికీ, మన సోవియట్ వ్యవస్థనూ, కమ్యూనిస్టుపార్టీ విధానాలనూ మరింత బలపరచడానికీ, మరింత అభ్యుదయాన్ని, సత్వర పురోగతినీ సాధించడానికీ మనం లోపాలనూ, తప్పులను పైకి తెచ్చి విమర్శిస్తాము. అయితే విమర్శ విషయంలో కొందరు రచయితల దృక్పథమేమిటి? వారికి జీవితం గురించి పరిజ్ఞానం గాని, తగినంత రాజకీయ అనుభవంగాని, జీవితంలోని ముఖ్యాంశాలను గమనించే సామర్థ్యంగాని లేకపోవడంవల్ల, కొందరు ఉద్యోగులు చేసిన తప్పులనూ, వారి లోపాలనూ తీసుకుని

సవ్యాపసవ్యాలు చూడకుండా వాటిని కుప్పపెట్టి తాము బెదిరిపోతారు, యితరులను భయపెట్టడానికి ప్రయత్నిస్తారు.

ఉదాహరణకు వి. దుదిన్‌త్సేవ్‌కు యిటువంటి దురవస్థే పట్టింది. ఆయన వ్రాసిన "కేవలం తిండికోసం కాదు" అనే పుస్తకాన్ని యిప్పుడు విదేశాలలోని అభివృద్ధి నిరోధక శక్తులు మనకు వ్యతిరేకంగా వుపయోగించడానికే ప్రయత్నిస్తున్నాయి; ఆ పుస్తకంలో, పక్షపాతంతోనూ, మనపట్ల ప్రతికూలతతోనూ కూడిన దృక్పథంతో వ్యాఖ్యానించబడిన కొన్ని చెడ్డ విషయాలు — యివి దురుద్దేశంతో ఎంచుకోబడినవి — వున్నాయి. వీటితో బాటు దుదిన్‌త్సేవ్ పుస్తకంలో సరిగ్గానూ, శక్తివంతంగానూ రచించబడిన పుటలుకూడా వున్నాయి; అయినప్పటికీ దాని మొత్తం ధోరణే పూర్తిగా తప్పు. ఈ గ్రంథకర్త మన జీవితంలో గమనించిన లోపాలను తొలగించడంగురించి పట్టించుకోలేదనీ, లోపాలను ఉద్దేశపూర్వకంగా అతిశయోక్తులుచేసి చెబుతూ వాటిని చూసి సంతోషిస్తున్నాడనే అభిప్రాయం పాఠకుడిలో ఏర్పడుతుంది. సారస్వతం కళలలో జీవిత వాస్తవికతను చిత్రించడం పట్ల అటువంటి దృక్పథం, వాటిని తప్పుగా చిత్రించే ఉద్దేశం తప్పక రేకెత్తదు; అది విరూప దర్పణంలోని వక్ర ప్రతిబింబంలా వుంటుంది.

## పత్రికలు ఒక ఆయుధం

ఈ అనారోగ్యకరమైనట్టి, హానికరమైనట్టి ధోరణిని, కొన్ని సాహిత్య పత్రికలూ, నవలా సాహిత్య ప్రచురణాలయాలు సకాలంలో కనిపెట్టి, సరిగ్గా అంచనావేసి, ఎదుర్కొనకపోవడం శోచనీయం. "నోవీమిర్" (నూతన ప్రపంచం) అనే పత్రిక దుదిన్‌త్సేవ్ పుస్తకాన్ని పోలిన రచనలను ప్రచురించింది. కొన్ని సాహిత్య పత్రికల సంపాదక కార్యాలయాలూ, కొన్ని ప్రచురణాలయాల యజమానులూ సకాలంలో మేల్కొనలేకపోయారు, కొన్ని సందర్భాలలో సూత్రాన్నే వదిలి దూరమైపోయారు. పత్రికలు మన ప్రధాన సైద్ధాంతిక ఆయుధమన్నదీ, కార్మిక వర్గానికీ, శ్రామిక ప్రజలకూ శత్రువులైన వారిపై పోరాటం సాగించడం వాటి లక్ష్యమన్నదీ వారు మరచిపోతున్నారు. పత్రికలవంటి వాడియైన ఆయుధం లేకపోతే, ఆయుధాలు లేని సైన్యం ఎంతగా పోరాడగలదో, పార్టీ తన సిద్ధాంత కృషిని కూడా అంతే సాగించగలదు. మనకు నమ్మకంలేని వారి చేతుల్లో మనం పత్రికలను వదిలిపెట్టలేము. మన ఆదర్శానికై విశ్వాసంగా పనిచేసే అత్యంత విధేయులూ, అత్యంత నమ్మకస్తులూ, రాజకీయంగా పురోగాములూ అయిన వారి చేతుల్లోనే అవి వుండాలి.

"లిటరరీ మాస్కో" అనే పత్రిక సిద్ధాంతరీత్యా తప్పుడు రచనలనూ, వ్యాసాలనూ ప్రచురించిందనీ, వాటిని ప్రజలు; ముఖ్యంగా రచయితలే తీవ్రంగా నిరసించారనీ కృశ్చేవ్ జ్ఞాపకం చేశారు.

సారస్వతంలో, పార్టీ ననుసరించాలనే భావం ప్రజాస్వామ్య భావానికి వ్యతిరేకమైనదిగా ఉపయోగించబడకూడదు, అన్నారు కృశ్చేవ్. సోవియట్ సామ్యవాద సమాజశక్తి, కమ్యూనిస్టు పార్టీ, ప్రజల ఐక్యతలోనే యిమిడి వుంది. ప్రజల మూల ప్రయోజనాలను వ్యక్తం చేస్తున్న కమ్యూనిస్టు పార్టీ విధానం, సోవియట్ సాంఘిక, రాజకీయ వ్యవస్థయొక్క శక్తికి మూలాధారం. కాబట్టి, కమ్యూనిస్టు పార్టీ విధానాన్ని అమలు జరపడంలో చురుగ్గా పాల్గొనకుండా మన సోవియట్ పరిస్థితుల్లో ఎవడైనా ప్రజలకు సేవ చెయ్యగలననుకోవడం పెద్ద పొరపాటు. పార్టీ అభిప్రాయాలనూ, దాని రాజకీయ విధానాన్ని అంగీకరించకుండా ప్రజలతోబాటు ముందుకు వెళదామనుకోవడం అవివేకం—ఎవడైతే ప్రజలతో వుండదలచుకుంటాడో వాడెల్లప్పుడూ పార్టీతో వుంటాడు, పార్టీ విధానాలకు ఎవడైతే కట్టుబడి వుంటాడో వాడెల్లప్పుడూ ప్రజలతో వుంటాడు.

## మంచి చెడ్డలు ఒకదాని ప్రక్క నొకటి వుంటాయి

పూల చెట్లపక్కనే ఒక్కొక్కప్పుడు గడ్డీ గాదరా మొలిచినట్లుగా మంచి విషయాలతోబాటు ఎల్లప్పుడూ చెడ్డవి కూడా వుంటాయి. జీవిత వాస్తవికతను చిత్రించడంలో అంతా రచయిత మీద ఆధారపడి వుంటుంది. రచయిత, శిల్పి, చిత్రకారుడూ, వాగ్గేయకారుడూ పార్టీ విధానానికి కట్టుబడి వున్నట్లయితే, ప్రజలకు సేవ చేస్తున్నట్లయితే, నూతన సమాజ నిర్మాణంలో ప్రజలకు మనస్ఫూర్తిగా సాయపడదలచుకున్నట్లయితే, కమ్యూనిజం నిర్మాణానికి మార్గం సుగమం చేసినట్లయితే కార్మికుల, సమిష్టి రైతుల, బుద్ధిజీవుల జీవితంలోనూ వ్యక్తుల జీవితంలోనూ, ఫ్యాక్టరీలూ సమిష్టి క్షేత్రాలు, ప్రభుత్వ క్షేత్రాలలోనూ అతనికి కావలసినన్ని మంచి దృష్టాంతాలు కనిపిస్తాయి; అతను చెడ్డ విషయాలను ఎదిరించి, గుణాత్మక విషయాలను, వాటిని యదార్థంగా, రమణీయంగా చిత్రించడం ద్వారా, బలపరచగలడు. అలా కాకుండా, రచయిత తన ప్రజల విజయాలను గమనించడంలో ఆనందం పొందలేకపోతే అతను చెడ్డ విషయాలకోసం, రుణాత్మక విషయాలకోసం తప్ప మరి దేనికోసమూ అన్వేషించడు; చెత్త కుప్పలను మాత్రమే వెదుకుతూ వుంటాడు; దానంతటినీ దృష్టాంతంగా తీసుకోదగిన ప్రత్యేకతగా చిత్రించడానికి ప్రయత్నిస్తాడు.

అయితే, పూల తోటల చిత్రాలు చిత్రించినట్టుగా ప్రతి దానినీ మనోహరంగా చిత్రించడం అవాస్తవికమూ, సత్యదూరమూ కాబట్టి, అటువంటి రచనను, అసత్య విషయాన్ని

దేన్నికూడా సహించలేని మన ప్రజలు ఏవగించుకుంటారు; అందువల్ల అటువంటి రచనలు చేసేవారిని కూడా మనం తీవ్రంగా విమర్శిస్తాము. దుదిన్ త్సేవ్ వ్రాసిన "కేవలం తిండి కోసమే కాదు" వంటి దుష్ప్రచారపూరిత రచనలనూ, "మరపురాని 1919", లేదా "క్యూరిన్ కోసక్కులు" వంటి తియ్యటి ఫిల్ములనూ కూడా సోవియట్ ప్రజలు త్రోసి పుచ్చుతారు.

## పార్టీ నాయకత్వం

సోవియట్ సమాజ జీవితాన్ని వక్రంగా చిత్రించే రచనలను మనం చూసి వూరుకోవాలని కోరే కొందరు "స్వేచ్ఛా రచన" వాదులు దురదృష్టవశాత్తూ సాహిత్య వేత్తలలోనూ, కళాకారులలోనూ వున్నారు. సూత్రాన్ని దృష్టిలో పెట్టుకొని మనం వాటిని విమర్శించడం వారికి కిష్టంలేదు. పార్టీ ప్రభుత్వమూ, సారస్వతం కళలకు దర్శకత్వం వహించడం యీ వ్యక్తులకు న్యూనతగా కనిపిస్తుంది. ఒక్కొక్కప్పుడు వారే దర్శకత్వాన్ని బహిరంగంగానే వ్యతిరేకిస్తూ వుంటారు. కాని తరచు వారు అనవసరమైన గారాబం చేసి, చొరవను అదుపులో పెట్టడం, మొదలైన వాటిని తీసుకోవడం ద్వారా తమ వాంఛలనూ, మనస్తత్వాన్నీ ముసుగువేసుకుంటూ వుంటారు, అన్నారు కృశ్చేవ్.

పార్టీ, ప్రభుత్వం యొక్క నాయకత్వం వల్లనూ సృజనాత్మక కృషిపట్లా, రచయితలు, చిత్రకారులు, శిల్పులు, వాగ్గేయకారుల పట్లా వాటి శ్రద్ధాసక్తుల వల్లనూ సారస్వతం కళల్లో మహత్తర విజయాలూ, సోవియట్ దేశంలోని సకల జాతుల సామ్యవాద సంస్కృతుల పురోగతీ సాధింపబడ్డాయన్న దానికి సోవియట్ సమాజాభివృద్ధి చరిత్ర అంతాకూడా కావలసినంత సాక్ష్యమిస్తూంది, అన్నారు కృశ్చేవ్.

## విమర్శ, ఆత్మ విమర్శ

సారస్వతానికీ, కళలకు సంబంధించిన శక్తులన్నీ సూత్రానికి కట్టుబడి ఏకమై సంఘటిత మవాలే గాని మార్క్సిజం-లెనినిజం నుండి దూరమైపోవడం ద్వారా కాకూడదని మనవాంఛ, అన్నారు కృశ్చేవ్. ఈ ఐక్యతను సాధించడానికే, సూత్రానికి కట్టుబడిన విమర్శ ఆత్మవిమర్శ పెంపొందుతున్నాయి. తప్పులు చేసేవారు వాటిని గమనించి, సరిదిద్దుకోడానికీ, మరింత గట్టి పునాదిమీద నిలబడి తమ సృజనాత్మక కృషి ప్రమాణాలను అభివృద్ధి చేయడానికీ యీ విమర్శ వారికి తోడ్పడుతుంది. విమర్శ, ఆత్మ విమర్శ సాగించడంలో ప్రతివాడూ, ఫలానా వ్యక్తి చేసిన తప్పులు యాదృచ్ఛికంగా జరిగినవా, లేక అవి అతని దృక్పథం వల్లనూ, ప్రవర్తనా ధోరణివల్లనూ పుట్టవించినవా అన్నది స్పష్టంగా తెలుసుకుని తీరాలి. ఈ వ్యక్తి విమర్శను ఎలా స్వీకరిస్తున్నాడనే విషయాన్నిగూడ గణనలోకి తీసుకోవాలి. తప్పులు ఎవరైనా చేయవచ్చును; కాని ఒక వ్యక్తి నిన్న ఏమి చేశాడన్నది చూడగలగడమే కాకుండా రేపు వాడేమి చేయగలడన్నది ముందుగా చూడగలగాలి; యిదే ముఖ్య విషయం: తన తప్పులను గుర్తించేందుకూ, సాధ్యమైనంత త్వరలో వాటిని సరిదిద్దుకునేందుకూ అటువంటి వానికి మనం సాయం చేయాలి.

మన సోవియట్ ప్రభుత్వమూ, కమ్యూనిస్టుపార్టీ, చెడిపోయారనీ, మరి లాభం లేదనీ వదలివేయబడిన వారినికూడా అనేకసార్లు బాగుచేసి మళ్ళీ సక్రమ మార్గంలో పెట్టాయి. తాము విమర్శించబడిన తరవాత సృజనాత్మక రచయితలు పెద్ద పెద్ద కళాఖండాలను సృష్టించిన సంఘటనలు అనేకం సారస్వతం కళల్లో వున్నాయి. కామ్రేడ్ దుదిన్ త్సేవ్ విషయంలో, మనం సాయపడినట్లయితే, తాను కోరినట్లయితే, అతను సరియైన మార్గానికి రాగలడనీ. ప్రజల శ్రేయస్సుకోసమూ, మన సామ్యవాద మాతృభూమి శ్రేయస్సుకోసమూ మన రచయితలందరితో కలసి కృషిచెయ్యగలడనీ నా నమ్మకం.

తరవాత కృశ్చేవ్, సారస్వతం కళల అభివృద్ధిలో రచయితల సంఘాలు నిర్వహించగల ప్రధాన పాత్రను గురించి తెలియజేస్తూ యీ సంఘాలలో నిజమైన మైత్రీ, సృజనాత్మక ప్రగతిపట్ల స్నేహపూర్వకమైన శ్రద్ధాశక్తులూ వుండాలని నొక్కి చెప్పేరు. రష్యన్ సమాఖ్య రచయితల సంఘం స్థాపించాలనే ప్రతిపాదనను ఆయన బలపరిచేరు.



సంపుట 8
సంచిక 18

# సోవియట్ భూమి

సెప్టెంబర్
28, 1957

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖచే ప్రచురింపబడుతోన్న సచిత్ర పక్ష పత్రిక



## మా కజఖిస్తాన్



సోవియట్ సోషలిస్టు రిపబ్లికల సమాఖ్యలో ఇతర రిపబ్లిక్‌లతోపాటు ఇచ్ఛా పూర్వకంగా చేరిన సర్వసత్తాధికార సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ కజఖస్తాన్ తూర్పున అల్టాయ్ పర్వతాలనుంచి. పశ్చిమాన కాస్పియన్ సముద్ర తీరాలవరకూ, ఉత్తరాన ఉరల్స్, సైబీరియన్ స్టెప్పీలనుంచి దక్షిణాన తియన్‌షాన్ కొండలవరకూ విస్తరించి వున్నది. 2.766.000 చదరపు కిలోమీటర్ల భూభాగంగల కజఖస్తాన్ పాకిస్తాన్‌కు మూడు రెట్లు, ఫ్రాన్సుకు ఐదురెట్లు. బ్రిటన్‌కు 11 రెట్లు వున్నది.

ఉత్తర కజఖస్తాన్‌లోని సారవంతమైన స్టెప్పీలు, దక్షిణాన వున్న చక్కని పంట నిచ్చగల భూములు 1917 అక్టోబరు విప్లవానికి పూర్వం పశువులను మేపడానికి మాత్రమే ఉపయోగింప బడుతూ వుండేవి.

"ఒలోగ్డాకు ఉత్తరాన, డాన్ నది తీరపు రోస్తోవ్‌కు, సరతోవ్‌కు ఆగ్నేయ దిశను, ఓరెన్‌బర్గ్‌కు, ఓమ్స్కు దక్షిణాన, తోమ్స్కు ఉత్తరాన అనేక వ్యవసాయ క్షేత్రాలుగా రూపొందగల విశాల భూభాగం వున్నది. కాని ఈ విశాల ప్రాంతంలో మత గురువుల పెత్తనం, అర్ధ-అటవికత, వాస్తవమయిన అటవికత అమలులో వున్నాయి..."

ఈ మాటలు సోవియట్ ప్రభుత్వ స్థాపకుడైన లెనిన్ మహాశయు లన్నవి. లెనిన్, అక్కడ యుగయుగాలుగా వుంటూ వచ్చిన మత గురువుల పెత్తనంపైన దృష్టిని సారించడమేగాక, వెనుకబడి వున్న యీ సరిహద్దు ప్రాంతాలను ఉత్తమమైన ఆధునిక మార్గంలోకి తీసుకొని రావడానికి మార్గాలనుకూడా సూచించారు.

అక్టోబరు సోషలిస్టు విప్లవం కజక్ ప్రజలకు స్వాతంత్ర్యాన్ని,

(మిగత 7వ పుట చూడుడు)

## ఈ సంచికలో



ముఖచిత్రం: నాదియా అఖమెరోవా, అల్మా-ఆతా నివాసిని.
ఛాయాచిత్రకారుడు: వి. కుపిన్కో
వెనుక అట్ట: గవాక్షంలోనుంచి చూస్తోన్న "మిర్నీ" యువనావికుడు.
ఛాయాచిత్రకారుడు: ఎం. ముర్‌జోవ్

# ప్రజలే పాలకులైన దేశంలో

(ప్రచారకుని స్మృతులు)

వి. కుపిన్స్కి

ఈ సంచిక మొదలుకొని మేము, యీ మధ్యనే కజఖస్తాన్‌లో పర్యటించిన మా విలేఖరి పర్యటనానుభవాలను ప్రకటిస్తున్నాము.

ఈ పర్యటనానుభవాలలో రచయిత, పూర్వపు సంచారజాతులు యేవిధంగా స్టెప్పీలను సస్యశ్యామలం చేసిందీ, నగరాలను, ఫ్యాక్టరీలను నిర్మించిందీ, నూతన సోషలిస్టు సమాజాన్ని స్థాపించుకొన్నదీ తెలియజేయడానికి ప్రయత్నించారు.



సిర్ దర్యా నదిమీది, క్జిల్-వోర్డావీటి పనరుయొక్క ఆనకట్టు





కజఖస్తాన్‌లోని క్జిల్-వోర్డా ప్రాంత, క్జిల్-తూ సమిష్టిక్షేత్ర వ్యవసాయశాస్త్రజ్ఞుడు ముస్తాఫా తజికోవ్, వరినాట్లు ఏఏ పొలాలలో వెయ్యాలన్న పథకాన్ని గురించి వరి సేద్య దళ సభ్యులతో చర్చిస్తోన్న దృశ్యం



## బిచ్ సు-జర్ జౌల్

"నీరున్నచోట జీవం ఉంటుంది" అని అర్థం, పై శీర్షికకు. ఆసియాలో యీ నానుడి తెలియని వారుండరు. గత శతాబ్దం అంత్యంలో నికొలాయ్ డిమైలాస్టెత్ అనే ఒక భూగర్భశాస్త్రజ్ఞుడు మధ్య ఆసియాలోని సిర్-దర్యా నదీ ప్రాంతపు మట్టిపైన సుదీర్ఘ పరిశీలనలు జరిపి, విచారకరమైన పరిస్థితిని వెల్లడించాడు.



"క్రమక్రమంగా యీ భూమి నిస్సారవంతమైన విచారకర పరిస్థితి వెల్లడవుతున్నది. ఇది నానాటికీ అర్ద్రరహి

తమైపోతున్నది. దీని నీటి మూలాధారాలు క్షీణించిపోతున్నాయి. అరేబియన్ చరిత్ర కారులు వేడి దాహపు భూమిగా పేర్కొన్న యీ భూమి పునర్జీవనాన్ని పొందుతుందా అన్నదే ఒక సమస్య."



ఈనాడు అలాంటి సమస్య ఎవ్వరికీ ఎదురుకాదు. సిర్-దర్యా పొడుగుతా ఉన్న ప్రాంతమంతా సస్యశ్యామలంగా మారి పోయింది. నగరం సమీపంలో ఉన్న నదికి అడ్డుగా బ్రహ్మాండమైన కాంక్రీటు ఆనకట్ట కట్టబడింది. అనేక కాలువల సహాయంతో ఆ నదినీరు రైతుల పొలాలకు పట్టించబడింది. ఇప్పుడు 222,000 హెక్టర్ల భూమికి నీరు సరఫరాచేయబడుతున్నది. ఇక్కడి ఒకొక్క హెక్టారు భూమిలో ఇప్పుడు 8 టన్నులధాన్యం పండుతున్నది. మరొకటి, రెండు సంవత్సరాలలో, కొత్తగా త్రవ్వబడిన కాలువల సహాయంతో, ఈ ప్రాంతాల్లోని పంటను రెండింతలు చేయడం సాధ్యమవుతుంది. కొత్త వరి పొలాలు సేద్యంలోకి తేబడుతాయి. సిర్-దర్యానది ఎనిమిది మిలియన్ హెక్టార్ల భూమికి నీటిని సరఫరా చేయగలదు. ఇక్కడి







రైతులు తమ ఉన్ని ఉత్పత్తిని 3.5 రెట్లను, పాల ఉత్పత్తిని 4 రెట్లను పెంపొందించుకోడానికి ఇది తోడ్పడుతుంది. ఇదంతా క్జాల్-ఓర్డిన్ ఆనకట్టవల్ల సాధ్యమవుతున్నది. ఈ ఆనకట్ట ఆసియాలోని ఆనకట్టలన్నింటిలోకి పెద్దది. రిపబ్లిక్ దీనిని నిర్మించింది.

## ప్రముఖుని సందర్శనం

సిర్-దర్యానదీ ప్రాంతంలోని క్జిల్-తులో రైతులు ధాన్యం పండిస్తున్నారు. ఈ వ్యవసాయ క్షేత్రం అధ్యక్షుడు రహ్మెత్ నురెకియేవ్ నన్ను తన కారులో పచ్చని పొలాల గుండా తీసుకొని వెళ్ళాడు. ఆ దృశ్యం చూస్తుంటే నాకు కజఖ్ తివాచీలు గుర్తుకు వచ్చాయి.

హఠాత్తుగా వినవచ్చిన ఒక బ్రహ్మాండమైన శబ్దంలో మా కారుశబ్దం మునిగిపోయింది. పంటలపై యెరువులను జల్లుతున్న ఒక విమానం మాకు కనబడింది.

వరి పంటలో గొప్ప విజయాలను సాధించినందుకు ప్రఖ్యాతి పొందిన ఇబ్రయ్ జజయేవ్ ఇంటికి తీసుకువెళుతూ వుండినాడు, అధ్యక్షుడు నన్ను. అక్కడక్కడా తెల్ల వెంట్రు





సమిష్టిక్షేత్ర దారునితో మా విలేఖరి వి. కుపిన్కో సంభాషిస్తోన్న దృశ్యం



కారకుల్ గొర్రెల మంద మధ్యనవున్న. కజఖ్‌స్తాన్, క్జిల్-వోర్డా ప్రాంత, గొర్రెల ప్రజనన సమిష్టిక్షేత్ర కాపరి, ఝూ సుప్పన్‌జార్ ఖైతెకెయేవ్



కలు కనబడుతున్న పిల్లి గెడ్డంగల పొట్టి మనిషి జజయేవ్, ద్వారం దగ్గరే మాకు స్వాగతమిచ్చి అతని నాల్గు గదుల ఇంటిలోకి

తృతీయ అంతర్జాతీయ సమిష్టిక్షేత్ర (హంగ్రీ స్టెప్పె) భూములలో పండిన పత్తిని నిలువచేయటానికి గోదాములకు పంపుటకై, లారీకెక్కించబడుతున్న దృశ్యం





తీసుకొని పోయాడు. చదువురాక, అనాథ స్థితిలో వున్న సమయంలో అతడు 1929 వ సంవత్సరంలో సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరాడు. తనవనుకోడానికి, కుటుంబంగాని, ఇల్లుగాని, భూమిగాని, పశువులుగాని వుండేవి కావతనికి. ఈ నాడు అతడు సామ్యవాద శ్రమ వీరుడు. తన దేశంలో అత్యున్నతాధికార సంస్థ అయిన కజఖ్ రిపబ్లిక్ సుప్రీమ్ సోవియట్ ప్రతినిధి.

జజయేవ్, అతని సహచరులు ఐదుగురు కలిసి 50 ఎకరాల భూమిని సాగు చేస్తూ సగటున 200 మెట్రిక్ టన్నుల ధాన్యాన్ని పండిస్తున్నారు.

"యంత్రాలు లేకుండా యింతపనిని మేము చేసి వుండలేకపోయే వార మన్నది, సహజమైన విషయమే, అంటూ చెప్ప సాగాడతడు. "నిజానికి పనిలో మూడువంతులు యంత్రాల చేతనే జరుగుతున్నది. దున్నడం, విత్తు జల్లడం, ఎరువులు వేయడం మొదలైన పనులన్నీ యంత్రాల ద్వారానే జరుప బడుతున్నాయి."

ఒకసారి ఆలోచించినట్లయితే బ్రహ్మాండమైన పనులు సాధింపబడినట్లు వ్యక్తమవుతుంది: యుగయుగాలుగా సంచార జాతులుగా వుంటూ వచ్చిన ప్రజలు ఇరవై సంవత్సరాల లోపల ఒకచోట స్థిరమైన జీవితాన్ని కల్పించుకొని, ఇండ్లను నిర్మించుకొని, బ్రహ్మాండమైన పంటలను పండించు కొంటున్నారు.

దేశ ద్రిమ్మరులై తిరిగే ఒక పూర్తి జాతికి స్థిర ఆవాసం కల్పించడానికి, వారికి భూమిని, యంత్రాలను, అన్నిటికీ మించి భద్రతనూ చేకూర్చే నూతన జీవితాన్ని కల్పించడం ఎంతయినా అవసరం. సోవియట్ వ్యవస్థే దీనికి పునాదులు వేయబడ్డాయి.

# వర్ధమాన కజఖ్ ప్రజా సంస్కృతి

ఎ. కనపిన్
కజఖ్ సోవియట్ సోషలిస్టు
రిపబ్లిక్ సంస్కృతీ మంత్రి

సుప్రసిద్ధ అమెరికన్ యాత్రికుడు, జార్జి కెన్నన్, 1885 లో, 'సెమిపలాటిన్స్క్'ను సందర్శించినప్పుడు, స్థానిక గ్రంథాలయపు నిలకడైన చదువరులలో, మధ్య వయస్కుడైన కజఖ్‌వాసి ఒకడు, 'సాహిత్యం' లోనే గాదు, తత్వశాస్త్రంలోనూ విశేష పరిజ్ఞానాన్ని కలిగి వుండడంచూచి విస్మితుడైనాడు. ఆయనే, అబాయ్ కునన్‌బయేవ్, కజఖ్ లిఖిత సారస్వత నిర్మాత.

ఒక కజఖ్ బకిల్, స్పెన్సర్, మిల్, లాకేల రచనలను అధ్యయనం చేస్తుండడం: ఇది కెన్నన్ ఊహకు అతీత మనిపించింది. అది అంత ఆశ్చర్యకరమనిపించడానికి కూడా కారణం లేకపోలేదు. ఆ రోజులలో కజఖ్కులలో చదువుకున్నవాళ్ళను అరచేతి వ్రేళ్ళ మీద లెక్కించవచ్చు. విప్లవానికి పూర్వం, కజఖస్తానంలో నూటికి తొంభై ఎనిమిది మంది నిరక్షరాస్యులు. రష్యన్ సామ్రాజ్యపు బాగా వెనుకబడిన వలస ప్రాంతాలలో కజఖస్తాన్ ఒకటి.

నలభై సంవత్సరాలు ఒక ప్రజల చరిత్రలో ఎంతో అల్పమైనవి. అయినా ఈ స్వల్ప కాలంలో కజఖస్తాన్‌లో వచ్చిన మార్పులు ఎంతో గణనీయమైనవి. నిన్నటి సంచార ప్రజ, ఇప్పుడు స్వీయ మేధావులను, స్వకీయ జాతీయ సాహిత్యాన్ని, వృత్తులకు సంబంధించిన స్వకీయమైన జాతీయ కళను, దేశీయ స్వీయ శాస్త్ర విజ్ఞానాన్ని కలిగి వున్నారు.

కజఖస్తాన్ శ్రామిక ప్రజలకు, సోవియట్ విధానం - అపూర్వమైన ఆధ్యాత్మిక సంపత్తికీ, మానవకోటి సముపార్జించుకొన్న మహత్తర సంస్కృతికీ ప్రవేశ సాధనాన్ని కల్పించింది. 1919 లో వి. ఐ. లెనిన్ నిరక్షరాస్యత నిర్మూలన చట్టంమీద సంతకంచేసి, కజఖస్తాన్ ప్రజా బాహుళ్యపు తరతరాల వెనుకబాటు తనంమీద, అవిద్య అజ్ఞానాలమీద తీవ్రమైన దాడిని ప్రారంభించారు. నగరాల నుండి సంచార ప్రజల గుడారాల దగ్గరకు, చేపలవాళ్ళ గుడిసెల దగ్గరకు, పొలం పనివారి కుటీరాల దగ్గరకు వందలాది చదువుకున్నవాళ్ళు రావడంతో వారికి వెలుగు కలిగినట్టయింది.

ప్రజలలో నిరక్షరాస్యతను నిర్మూలించాలనే ఈ విస్తృత కార్యక్రమాన్ని చేపట్టేటప్పటికి, మొట్టమొదటి అడుగులోనే ఎన్నో అవరోధాలను ఎదుర్కోవలసి వచ్చింది; కార్య ప్రణాళికలూ లేవు. కజఖ్ భాషలో పాఠ్య గ్రంథాలూ లేవు, కాగా సుశిక్షితులైన కజఖ్ ఉపాధ్యాయులూ లేరు. సంచార, లేక కొంతవరకు సంచార జీవితానికి ప్రజా బాహుళ్యము అలవాటుపడి వున్నందున పాఠశాలలు నెలకొల్పడానికి మరికొన్ని అదనపు సమస్యలు ఎదురైనాయి. రష్యాలోని మాస్కో, లెనిన్‌గ్రాడ్ మొదలైన నగరాలు కజఖస్తానాన్ని ఆదుకున్నాయి. ఈ నగరాలలోనే పాఠ్య గ్రంథాలు తయారు చేయబడి, ముద్రించబడ్డాయి, మొట్టమొదటి జాతీయ ఉపాధ్యాయ దళాలకు యిక్కడ శిక్షణ యివ్వబడింది. ఇక్కడనుంచే కజఖ్ పాఠశాలలకు మ్యాపులు, దృశ్యాత్మక బోధనా పరికరాలు పంపబడ్డాయి. కజఖస్తాన్లోని సంచార ప్రజావాసాలలో బోర్డింగ్ పాఠశాలలు నెలకొల్ప బడ్డాయి.

పిల్లలే కాదు, వివిధ వయస్సులకు చెందిన పెద్దవాళ్ళు కూడా మొదటి వాచకం చేపట్టారు.

ఆ తర్వాత దీనిపిల్ల విద్యావిధానంనుంచి, సుశిక్షిత పారిశ్రామిక ప్రవీణ, వ్యవసాయ, వైద్య ప్రవీణ దళాలను కజఖస్తాన్లో రూపొందించ వీలు కలిగినది. విప్లవానికి పూర్వం, రిపబ్లిక్ మొత్తంమీద ఒక్క ఉన్నత విద్యా సంస్థకూడాలేదు, ఈనాడు ఇక్కడ, 26 ఉన్నత విద్యా సంస్థలు, రమారమి 50,000 విద్యార్థుల కలిగి వున్నాయి. ఇవిగాక 70,000 విద్యార్థుల కలిగివున్న ప్రత్యేక సెకండరీ పాఠశాలలు 128 వున్నాయి. రిపబ్లిక్ ముఖ్యపట్టణం 'అల్మా-అరా'లో కజఖ్ బాలికలకు రెండు ప్రత్యేక విద్యాసంస్థలున్నాయి.

కజఖ్ శాస్త్ర విజ్ఞాన పరిషత్తు, శాఖోప శాఖలుగా దానిని అల్లుకొనివున్న పరిశోధనాలయాలు, లేబొరేటరీలు, శాస్త్రీయ కేంద్రాల నిర్మాణాన్ని మేము ఒక గొప్ప విజయంగా పరిగణిస్తాము.

విప్లవానికి పూర్వం, కజఖస్తాన్లో ముద్రించబడే పన్నెండు వార్తా పత్రికలకు ప్రత్యామ్నాయంగా, 400 వార్తా పత్రికలు మొత్తం 14 లక్షల ప్రతుల ప్రచారం కలిగినవి, ఈనాడు రిపబ్లిక్కులో వెలువరించ బడుతున్నాయి.

కజఖ్ రచయితల గ్రంథాలు, కవుల కావ్యాలు బాగా ప్రఖ్యాతికెక్కాయి. ఔఎజోవ్, ముస్రెపోవ్, ముకనోవ్, ఒమ్‌స్తెన్, ప్రజాకవి జాంబుల్ రచనలు అనువదితమై ఐరోపా, ఆసియా, ఆఫ్రికాలలోని అనేక దేశాలలో ప్రకటిత మైనాయి.

కజఖస్తాన్ స్వీయ చలనచిత్ర పరిశ్రమను, ప్రదర్శనశాలలను నెలకొల్పు కున్నది.

సోవియట్ పాలనలో కజఖస్తాన్ స్వీయ చిత్ర, శిల్పకళల సృష్టించు కొన్నది.

కజఖస్తాన్ సాంస్కృతికాభివృద్ధి పరంపరగా త్వరగతిన సాగిపోతున్నది. కజఖ్ ప్రజలు ఈనాడు, మౌలికమైన, బహుముఖమైన తమ సాంస్కృతిక సంపత్తి పెంపొందుతున్న, ప్రవర్ధమాన మవుతున్న మహత్తర స్వర్ణ యుగంలో జీవిస్తున్నారు.

కజఖస్తాన్, ఉపాధ్యాయినీ శిక్షణాలయాంతర్భాగపు దృశ్యం



# మహత్తర భవిష్యత్తుగల మన స్నేహం

ఎం. జన్గాలిన్

విదేశాలతో సాంస్కృతిక సంబంధాల

కజక్ సంఘాధ్యక్షుడు



అల్మా-అతా విమానాశ్రయం వద్ద, జూన్ 16, 1955 న, భారత రిపబ్లిక్ ప్రధాని, శ్రీ నెహ్రూ, అభినందన సందేశాన్నిస్తోన్న దృశ్యం

భారత రిపబ్లిక్ ఉపాధ్యక్షులు, డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్, 1956 వేసంగిలో, అల్మ-అతాకు విచ్చేశారు

ఛాయాచిత్రంలో: డాక్టర్ ఎస్. రాధాకృష్ణన్, అల్మా-అతాలోని, భారీ ఇంజినీరింగ్ పరిశ్రమాగార కార్మికుల్ని సందర్శిస్తోన్న దృశ్యం



భారతీయ, కజఖ్ ప్రజల మధ్యన వేరూనిన స్నేహసంబంధాలు బహు లోతైనవి. పరిస్థితులు మన ఉభయ దేశాల చరిత్రలకు ఎన్నో సాదృశ్యాలను కల్పించాయి.

భారత ప్రజలలాగే, కజఖ్ ప్రజలు కూడా ఒకప్పుడు, తమ దేశంలో పరప్రభుత్వపు దారుణత్వాన్ని అనుభవించారు. కజఖస్తాన్ సంపదను ఒకప్పుడు, బ్రిటిష్ పెట్టుబడిదారు ఉరెక్వార్ట్, ఫ్రెంచి పెట్టుబడిదారు కార్నో, బెల్జియన్ వ్యాపారస్తులు, బ్యాంకర్లు దోచుకున్నారు. కజఖస్తాన్ గనులనుంచి తీసిన విలువైన లోహాలను ఓడలలో పరదేశాలకు ఎగుమతి చేసి, కజఖస్తాన్ అభివృద్ధిని అరికట్టి, దారిద్ర్యానికి గురిచేశారు. అయితే యీనాడు, మా స్వతంత్ర రిపబ్లిక్, ఐరోపాలోని పరిశ్రమాగారా లన్నింటికన్నా పెద్దవైన పరిశ్రమాగారాలను కలిగివున్నది.

దీనివల్ల, యీ ఉభయ దేశాల ప్రజలలో ఒకరిపట్ల మరొకరికి వున్న గాఢమైన ఆసక్తి సుబోధకమవుతున్నది. ఈ పరస్పర సాన్నిహిత్యానికి నిదర్శనగా, మా దేశ ప్రజలు భారత దేశానికి పర్యటిస్తుండడం, ప్రత్యామ్నాయంగా భారతీయ ప్రజాప్రతినిధులు మా కజఖస్తాన్‌కు విచ్చేయడం, యీ పరస్పరపు ప్రాతినిధ్యాలను తీసుకొనవచ్చు. మా భారతీయ అతిధులలో, ఆర్థిక వేత్తలు, వైద్యులు కార్మికసంఘ నాయకులు, నాటకరంగ ప్రతినిధులు, రచయితలు, లోకసభా సభ్యులు ఉన్నారు.

భారత రిపబ్లిక్ రూపొందిన మరుసటి సంవత్సరమే, పంచ వర్ష ప్రణాళిక నిర్వహణ సందర్భంగా, భారతప్రభుత్వ ప్రతినిధిగా డాక్టర్ మహలనోబిస్ మా దేశానికి విచ్చేశారు. ఆయన, రిపబ్లిక్ ముఖ్యపట్టణమైన అల్మా-అతాను, నగరంలోని ఎస్టాబ్లిష్‌మెంట్లనూ సందర్శించి, ప్రజలలో వివిధ వర్గాలకు చెందిన వారితో నిరాడంబరంగా, నిష్కర్షగా చర్చించారు. ఈ అవకాశాన్ని పురస్కరించుకొని, మేముకూడా భారత జీవితపు వివిధరీతుల గురించి తెలుసుకొన గలిగాము.

ఒక సంభాషణలో డాక్టర్ మహలనోబిస్ దాదాపు ఇదే అభిప్రాయాన్ని వ్యక్తీకరించారు: నాకు సామ్యవాదంలో నమ్మకంవుంది. అయితే, సోవియట్ దేశాన్ని సందర్శించేటంత వరకూ, యీ నా సామ్యవాద ఆదర్శాలకు ఒక రూపం అంటూ ఏర్పడ లేదు. ఇక్కడ నేను. సోషలిస్టు ఆదర్శాలను వాస్తవంగా ఒక ఆకృతి ధరించటం చూస్తున్నాను. సోవియట్ దేశంలో, నాకు అత్యంత ఆశ్చర్యాన్ని కలిగించినది, ప్రతి వ్యక్తిలోని ఉత్సాహం, శక్తి, ఏక లక్ష్యసాధనకు అంకితమైన సమిష్టి యత్నం, ముఖ్యంగా యీ వృద్ధు

(మిగత 40వ పుట చూడుడు)

## మా కజఖ్‌స్తాన్

(1వ పుట తరువాయి)

సౌఖ్యాన్నీ చేకూర్చింది. కొద్ది సంవత్సరాల లోపల మా రిపబ్లిక్ పెద్ద పారిశ్రామిక దేశంగా రూపొందింది. ఇక్కడ అనేక విధాలైన ఖనిజ వస్తువులు లక్షలకొలది టన్నులలో త్రవ్వి తీయబడుతున్నాయి. ఉక్కు యంత్రాగారాలు నిర్మింపబడ్డాయి. నూనె తోడబడుతున్నది. విద్యుచ్ఛక్తి, రసాయనిక వస్తువుల ఉత్పత్తి చేయబడుతున్నాయి. ఒకప్పుడు నిరక్షరాస్యులుగా వుండిన కజఖ్ సంచార జాతుల సంతతి వారు విద్యావంతులై, ఆధునిక ఆయుధాలను ఉపయోగించడంలో ప్రావీణ్యతను సంపాదించి, రిపబ్లిక్‌లోని పరిశ్రమలలో పని చేస్తున్నారు.

సోవియట్ దేశానికి చెందిన ఇతర జాతుల ప్రజలందరి సంపూర్ణ సహకారము, అందులోను ముఖ్యంగా రష్యన్ ప్రజల సహకారమే లేకపోయినట్లయితే కజఖ్ ప్రజలు అంతటి స్వల్పకాలంలో అంతటి బ్రహ్మాండమైన అభ్యుదయాన్ని సాధించుకొనగలిగేవారు కాదు. వివిధ జాతుల ప్రజా మైత్రి, సోషలిస్టు వ్యవస్థ యొక్క విజయం — ఇవే మా రిపబ్లిక్ అభ్యుదయానికి మూలకారణాలు.

యుగయుగాలుగా బీడుభూములుగా ఉంటూ వుండిన స్టెప్పీ భూములు ఇప్పుడు పంట పొలాలుగా మార్చబడుతున్నాయి. కజఖ్‌స్తాన్‌లో సేద్యం చేయబడిన ఇరవై మిలియన్ హెక్టర్ల భూమిలో 1,000 మిలియన్ పూడ్లకు పైగా ధాన్యం పండింది.

*ఈనాడు కజఖ్‌స్తాన్ ప్రజలు సగర్వంగా ఇలా చెప్పుకొంటారు : "కజఖ్‌స్తాన్ చిత్రపటం వైపు ఒక్కసారి చూడండి. సరతోవ్‌కు ఆగ్నేయ దిశను, ఒరెన్‌బర్గ్‌కు, ఓమ్స్కు దక్షిణ దిశను మేము లెనిన్ మహాశయుడు ఇచ్చిన అనుజ్ఞలను అమలుపరుస్తున్నాము. మతిగురువుల పెత్తనం తుదముట్టింపబడింది. సౌభాగ్యవంతము, సంస్కృతీవంతము అయిన కజఖ్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ అవతరించింది."*

మా భారతీయ మిత్రులు తరచుగా మా కజఖ్‌స్తాన్‌కు వస్తూ, స్వతంత్రులు, సౌఖ్యవంతులూ అయిన కజఖ్ ప్రజల జీవితాన్ని స్వయంగా చూడాలని మేము అభిలషిస్తున్నాము.

# ఆల్మా-ఆతానుండి ఇందిరాగాంధీ

"పేరు ... ఇందిరా గాంధి
"ఇంటి పేరు.... ఖలుఖయేవా
"జన్మస్థలం ... ఆల్మా-ఆతా"!

ఆల్మా-ఆతాలోని ప్రసూతి గృహం రిజిస్ట్రేషన్ బుక్కులో, పుట్టుకల పట్టికలో, ఏప్రిల్ 20, 1957న, పై విధంగా, ఒక జననం లిఖించబడి వుంది.

ఆనాడే, నదెజ్దా ఖలుఖయేవా, ఒక రిటైర్డ్ ఆఫీసరు బెఖ్కాన్ ఖలుకయేవ్ భార్య, పన్నెండవ శిశువును కన్నది. ఆనాడే, ఢిల్లీకాని, ఇందిరా గాంధికి ఈ కేబుల్ పంపబడింది : "సోవియట్-భారతీయ శాశ్వత స్నేహం పేరిట, ప్రపంచ బాలల సంక్షేమం పేరిట, మేము మా కుమార్తెకు ఇందిరా గాంధి అని నామకరణం చేశాము."

త్వరలోనే, తల్లి పసికందు ఇందిరతో పాటు మాతా మందిరం నుంచి ఇంటికి తిరిగి వచ్చేటప్పటికి, ఖలుఖయేవ్ కుటుంబపు రెండంతస్తుల, పన్నెండు గదుల నూతన భవనం నిర్మాణమైంది. కుటుంబం ఆ వేడుక మహా వైభవంగా జరుపుకున్నది. చివరన, గృహ గాయకులు కచ్చేరి జరిపారు: 17 సంవత్సరాల అలిబెక్ ఎకార్డినిస్ట్, 16 సంవత్సరాల బెస్సల్తాన్, వయొలినిస్ట్, 11 సంవత్సరాల బోరిస్, కాన్సర్టినా వాద్యకారుడు, 13 సంవత్సరాల అస్లన్‌బెక్, సెల్లిస్ట్, 14 సంవత్సరాల ల్యూషా, పియానో వాద్యకారుడు.

నదెజ్దా ఖలుఖయేవా మాతామందిరం నుంచి తిరిగివచ్చిన రోజున తీసుకోబడిన ఛాయాచిత్రం ఇది. నవశిశువుతో సహా కుటుంబం యావత్తూ ఇక్కడ వుంది. ఖలుఖయేవ్ పెద్ద కొడుకు ఒక్కడే, ఇందులో లేడు. ఇంకొక పట్టణంలోని ఉన్నత విద్యా సంస్థలో చదువుకుంటూ వుండడంచేత, ఇప్పుడిక్కడికి రాలేకపోయినాడు. అయినా ఈ శుభ సమయాన, తల్లిదండ్రుల నభినందిస్తూ అతను ఇచ్చిన తంతిలో, అంవరం కలిసి భారత దేశాన్ని పర్యటించి వద్దామని, తన ఆకాంక్షను తెలియపరచాడు.... అవును, మనం కోరేదీ అదే. ఖలుఖయేవ్ దంపతులు, సకుటుంబంగా భారత దేశాన్ని సందర్శించాలనుకుంటున్నారు, నవ శిశువుకు మల్లే ఏకనామధేయురాలైన పెద్ద ఇందిరా గాంధీని బహుశా, వారు సందర్శించవచ్చు.

"చూడండి, ఆవిడ మన ఆల్మా-ఆతాకు రాలేదూ,".... "అందుకే వాళ్ళదగ్గర కెళ్ళడం మన విధి" అంటాడు తండ్రి.





జర్మన్ దురాక్రమణ కాలంలో ఎక్తెరినోస్లావ్‌లో(ఇప్పటి ద్నీప్రొపెత్రొవస్క్) దేశభక్తుల ఉరికంబాల కెక్కించడం.

# గడచిన దారి

## చరిత్ర తిరోగమించదు

సెర్గీ అలెగ్జేయెవ్, చరిత్రకారుడు, రచయిత

ఆక్టోబర్ మహావిప్లవానంతరం, సోవియట్ దేశం సాధించిన ప్రగతి అభివృద్ధులకు సంబంధించిన వ్యాసాలలో ఇది రెండవది. మొదటి వ్యాసం, సోవియట్ భూమి, పదహారవ సంచికలో ప్రకటితమైంది.

— సంపాదకుడు

లెనిన్‌గ్రాడ్‌లో సాయుధ తిరుగుబాటు జయప్రదం కావటంతోనే అక్టోబర్ విప్లవం పూర్తికాలేదు. అది దేశమంతటా వ్యాపించింది. మాస్కో, దక్షిణ రష్యన్ ప్రాంతాలు, ఉరల్ పర్వత ప్రాంతం, సైబీరియా, దూరప్రాచ్యం — ఇవన్నీకూడా పోరాటంలో చేరిపోయినై. పాత వ్యవస్థ కూలిపోతున్నది. సోవియట్ బలాన్ని ప్రతిచోటా హృదయపూర్వకంగా బలపరుస్తున్నారు. సోవియట్ అధికారాన్ని ప్రజలు స్వచ్ఛంగా ప్రతిష్ఠిస్తున్నారు. 1918 సంవత్సరం ఫిబ్రవరినెల వచ్చేనాటికి, అంటే, మూడు నెలలకు లోపలే, సోవియట్ జండా దేశమంతటా ఎగరటం మొదలుపెట్టింది. అది సోవియట్ శక్తి జైత్రయాత్ర. లెనిన్ చెప్పినట్లుగా అది సోవియట్ విజయ యాత్ర.

సోవియట్ ప్రభుత్వం, ప్రారంభ దశలోనే, శాంతినిగురించీ, భూమి విషయంలోనూ ఉత్తరువులు చేసిన వెనువెంటనే, జాతీయతా సమస్యను పరిష్కరించింది. ఇది సోవియట్ ప్రభుత్వాన్ని ఎదుర్కొన్న అతి ముఖ్య సమస్యల్లో ఒకటి. "రష్యా ప్రజల హక్కుల ప్రకటన" 1917 నవంబర్ రెండో తేదీన ఆమోదించటం జరిగింది. ఈ ప్రకటన, జార్ విధానంవల్ల పీడితులయిన వివిధ ప్రజల సమానత్వాన్నీ, స్వాతంత్ర్యాన్నీ ధృవపరిచింది. కావాలనుకుంటే సోవియట్ సమాఖ్యనుంచి విడిపోయి, స్వతంత్ర దేశాలుగా ఏర్పడే హక్కుతో సహా. స్వయం నిర్ణయాధికారాన్ని ఆ ప్రజలకు ఇచ్చింది. ఇది అక్టోబర్ విప్లవం సాధించిన మరొక మహత్తర విజయం. ఈ ప్రకటనలో వివేకాన్ని చాటుతూ పేర్కొన్న సూత్రాలే, సోవియట్ ప్రజల అజేయమయిన ఐక్యతా బంధాలను దృఢపరిచి, సమున్నత సోదర భావానికి పునాదులు వేసినై.

అక్టోబర్ మొదటి రోజులనుంచే, సోవియట్ ప్రజలు సోషలిస్టు నిర్మాణం తమ ప్రధాన కర్తవ్యంగా భావించారు. వెంటనే న్యాయమైన సంధి ఒప్పందం చేసుకోవలసిందిగా, యుద్ధంచేస్తున్న దేశాలన్నిటికీ, వారు గట్టి ప్రతిపాదనలు చేశారు. అయితే ఆరోజుల్లో ఒక్క దేశంకూడా, సోవియట్ అధికారాన్ని గుర్తించలేదు. జార్ హయాములో రష్యా మిత్రులుగా వున్న దేశాలన్నీకూడా, జర్మనీతో శాంతి సంప్రదింపులు జరపాలన్న ప్రతిపాదనను నిరాకరించినై. సోవియట్ ప్రభుత్వం బ్రెస్ట్ శాంతి ఒప్పందపు కఠిన షరతులకు ఒప్పుకోవలసివచ్చింది. ఆ ఒప్పందం ప్రకారం ఉక్రేన్ సోవియట్ రిపబ్లిక్‌నుంచి విడిపోయింది. ఎస్తోనియా, లత్వియాలను జర్మనీకి ఇవ్వటం జరిగింది.

గుక్క తిప్పుకునేందుకు లభించిన ఈ కొద్ది వ్యవధిని ఉపయోగించుకుని సోవియట్ ప్రజలు, తక్షణం శాంతియుత నిర్మాణ కార్యక్రమాన్ని ప్రారంభించారు. యుద్ధసామగ్రి పరిశ్రమలన్నిటినీ వ్యవసాయయంత్రాల ఉత్పత్తికీ, రవాణా సౌకర్యాలను పునరుద్ధరించటానికీ, వీలుగా మార్చివేశారు. ఆ రోజుల్లో మా విద్యుత్కేంద్రాలన్నిటిలోకీ పెద్దవయిన వోల్ఖోవ్, స్విర్, షతూరా కేంద్రాల నిర్మాణం, రష్యానంతా విద్యుచ్ఛక్తిమయం చేయటానికి లెనిన్ వేసిన బృహత్ పథకాన్ని విస్తరించటం, ప్రారంభమయినై.

దేశం శాంతియుత జీవనం కోసం కృషిచేసింది. శాంతి

జర్మన్ హంతకుడు, ఒక గృహంలోనుంచి దోచుకపోతున్న వస్తువులతో



లభిస్తుందన్న ఆశలతో జీవించింది. రష్యా ప్రజలకు గాలీ, తిండీ ఎంత అవసరమో, శాంతి అంతే అవసరమైంది. కాని . .

## శత్రుపరివేష్టితం

పదభ్రష్టులయిన వర్గాలు మాత్రం అధికారం, భూములు ఫ్యాక్టరీలు తమ చెయ్యి జారిపోయినందుకు మనస్సు సరిపెట్టుకోలేకపోయినారు, విదేశీ సామ్రాజ్యవాదుల సహాయంతో వారు, శైశవావస్థలో వున్న సోవియట్ రిపబ్లిక్‌మీద యుద్ధం ప్రారంభించారు.

1918 వసంతకాలంలో అమెరికన్ క్రూయిజర్ 'ఒలింపియా' ఉత్తర సోవియట్ రేవు మర్మాన్‌స్క్‌లో ప్రవేశించింది. అమెరికన్ సైనికులు ఆ నగరాన్ని ఆక్రమించుకున్నారు. ఆ తరవాత కొంత కాలానికి, బ్రిటిష్‌వాళ్ళూ, ఫ్రెంచివాళ్ళూ, అమెరికన్లూ కలిసి, ఉత్తరాదిలో మరొక రేవు ఆర్కేంజల్‌స్క్‌లో ప్రవేశించారు.

దక్షిణ ప్రాంతాల్లో, బ్రిటిష్ సేనలు ట్రాన్స్‌కకేషియా మీదా మధ్య ఆసియామీదా, దండెత్తినవి, ఫ్రెంచి నౌకాదళం నల్ల సముద్రంలోకి ప్రవేశించి, సోవియట్ భూభాగంమీద ఫ్రెంచి సైనికులను దించింది. పశ్చిమాన, బైలోరష్యా, బాల్టిక్ ప్రాంతాలు, ఉక్రేన్—యివన్నీ జర్మన్ల క్రింద వున్నయ్. సామ్రాజ్యవాదులు సోవియట్ యూనియన్ తూర్పు సరిహద్దుల్ని కూడా విడిచిపెట్టలేదు. మొదట జపాన్‌వాళ్ళూ, తరవాత అమెరికన్లూ, అక్కడకూడా రంగంలోకి దిగారు.

ఈ జోక్యందారులు మాదేశాన్ని కొల్లకొట్టటం ప్రారంభించారు. రైళ్ళకు రైళ్ళు ధాన్యం, పంచదార, మాంసం, వెన్న, బొగ్గు జర్మనీకి తీసుకపోయినారు. ఉత్తరానా, తూర్పునా కూడా, అమెరికన్లూ, జపాన్‌వాళ్ళూ, బ్రిటిష్‌వాళ్ళూ, అడవుల్ని కొట్టివేసి, బంగారాన్నీ, విలువగల రోమాలనూ ఎగుమతి చేసుకున్నారు.

జోక్యందారులు తాము ఆక్రమించుకున్న ప్రాంతాల్లో, కార్మిక ప్రజలంతా కంటగించుకున్న దోపిడిదారుల ప్రభుత్వాన్ని మళ్ళీ నెలకొల్పారు, రష్యన్, ఉక్రేన్ మొదలైన సామ్రాజ్యవాదులతో కలిసి, కార్మిక జనాన్ని శిక్షించటం మొదలుపెట్టారు.

జైళ్ళన్నీ కిటకిటలాడిపోయినై. వేలకొద్ది రైతుల్నీ, కార్మికుల్నీ కాల్చివేశారు. అధికారచోరులు కమ్యూనిస్టులపట్ల మరీ క్రూరంగా ప్రవర్తించారు. ప్రముఖ కమ్యూనిస్టూ, దూరప్రాచ్యం గెరిల్లా దళాల ఉజ్వల నాయకుడూ అయిన సర్గయ్‌లాజోని, ఆ పశుప్రాయులు, నేలమీద పడేసి కాళ్ళతో తొక్కి, తుపాకి మడమలతో కొట్టి, ఆ తరవాత, బతికివున్నవాడినే రైలింజన్ పొయ్యిలో పడేసి కాల్చివేశారు. బాకూ కొమిస్సార్‌లని ప్రఖ్యాతి కెక్కిన బాకూ కార్మిక నాయకులు 26 మందినీ, వారుచేసిన చిత్రవధకూడా క్రూరత్వంలో దీనికి తీసిపోదు. తుర్క్‌మేనియా ఆక్రమించుకున్న బ్రిటిష్ జోక్యం దార్లు వారిని ఎడారిలోకి తీసుకెళ్ళి, అతి కర్కశంగా కాల్చి చంపారు.



వ్లాడివొస్తక్ రేవులో దిగుతున్న ఫ్రెంచి సైనిక దళాలు

విదేశీ దురాక్రమణదారులు తామొక్కరే పోరాడలేదు. సోవియట్ శత్రువులయిన వెనకటి భూస్వాములూ, పార్టీ యజమానులూ, ధనిక రైతులూ—వీళ్ళతోనూ, వీరి అనుచరులతోనూ, పెద్ద పెద్ద సైన్యాలు తయారు చేశారు. ఈ సేనలని 'వైట్'లనీ, 'వైట్ గార్డ్స్' అనీ పిలిచేవాళ్ళు. ఈ సేనలకి జార్ విధానం బలపరిచే సైనికాధికారులను సేనానులుగా నియమించారు. అందులో ఒకడు ఎడ్మిరల్ కోల్చక్. ఈ సైబీరియా సిపాయి తాను రష్యాకి సార్వభౌముడనని ప్రకటించుకున్నాడు. ఈ కోల్చక్ గురించి సైబీరియా ప్రజలు ఒక పాటకూడా కట్టారు.

దుస్తులేమొ బ్రిటన్ నుంచి
భుజకీర్తులు ఫ్రాన్స్ నుంచి
జపాన్‌వాడి పొగాకూ
చిందులేసె కోల్చక్.

తమ విదేశ యజమానుల మద్దతుతో ఈ వైట్ గార్డులు దేశంలో జొరబడ్డారు. సైబీరియా ఆక్రమించారు. ఉక్రేన్ యావత్తూ ఆక్రమించారు. లెనిన్‌గ్రాడ్‌ని సమీపించారు. మాస్కోని చుట్టుముట్టటం ప్రారంభించారు.

క్రెమ్లిన్ మండలాన్ని మే-డే నాడు, "సుబోత్నిక్" (పనిదినమైనా సమిష్టి కార్యకలాపాల నిర్వర్తించే స్వచ్ఛంద సేవా దళం) పరిశుభ్రపరుస్తోన్న దృశ్యం



సోవియట్ రిపబ్లిక్ అన్ని వైపులా శత్రు పరివేష్టితం అయిపోయింది.

## సోవియట్ రష్యా ఛోడ్ దో

అక్టోబర్ విప్లవ విజయాలనూ, సోవియట్ రష్యా స్వాతంత్ర్యాన్నీ సాయుధ బలాలు మాత్రమే రక్షించగలవనే పరిస్థితి ఏర్పడింది. 1918 జనవరి నెలలో బోల్షివిక్ పార్టీ, సోవియట్ ప్రభుత్వమూ కూడా, కార్మిక కర్షకుల కొత్త సైన్యాన్ని, ఎర్ర సైన్యాన్ని సృష్టించేందుకు నిశ్చయించినై. ఆ క్లిష్ట సమయంలో లెనిన్ అహోరాత్రులు పని చేశారు. ఆయన కార్మిక దళాలతో మాట్లాడారు; ఎర్ర సేనానులతో సమాలోచనలు జరిపారు. ఎర్ర సైనికులకు దుస్తులూ, ఆయుధాలూ సమకూర్చే సమస్యమీద ఆలోచన సాగించారు.

దేశమంతా ధ్వంసమయిపోయింది. చాలా కర్మాగారాలూ, ఫ్యాక్టరీలూ పని లేకుండా వున్నాయి. వాటిని నడిపించేందుకు ఇంధన పదార్థాలు లేకపోయినై. రొట్టె రేషన్ కోసం జనం గంటలకొద్దీ, బార్లు తీర్చి పడిగాపులు పడ్డారు. వాళ్ళకి నూరు గ్రాముల రొట్టె ఇచ్చేవాళ్ళు. అప్పుడప్పుడూ 50 గ్రాములు మాత్రమే లభించేది. అయినా, శ్రామిక జనం తమ అధికారాన్ని కాపాడుకునేందుకు ఏ త్యాగం చేయటానికయినా సిద్ధపడ్డారు. సరయిన శిక్షణా, ఆయుధాలూ లేకపోయినా, చింకి గుడ్డలు కట్టుకుని ఎర్ర సైనికులు నిర్భయంగా పోరాడారు. విజయం సాధించారు.

సోవియట్ అధికారాన్ని రక్షించటంకోసం లక్షలకొద్దీ కార్మికులు, కర్షకులు నడుం కట్టారు. శత్రువులకు వెనకపక్కన గెరిల్లా దళాలు ఏర్పడ్డయ్. కార్మికుల పటాలాలూ, సేనలకు సేనలే తయారయినయ్. ప్రజా సామాన్యంలో నుంచి సమర్థులయిన సేనానులూ, వీరులూ ఉద్భవించారు.

ఈ పోరాటంలో మా దేశ ప్రజలు ఒంటరిగా లేరు. బ్రిటన్, ఫ్రాన్స్ మొదలైన పెట్టుబడిదారీ దేశాల కార్మికులుకూడా కార్మిక కర్షకుల ప్రథమ రాజ్యం రక్షణకు ముందుకు వచ్చారు. లండన్, పారిస్, రోమ్ మొదలైన నగరాల్లో సభలు, ప్రదర్శనలు జరిపారు. అక్కడ ఆయుధ కర్మాగారాల కార్మికులు ఆయుధాలు ఉత్పత్తి చేసేందుకు నిరాకరించారు. రేవు కార్మికులు వాటిని ఓడలలోకి ఎక్కించటానికి నిరాకరించారు. సైనికులూ, నావికులూ కూడా సోవియట్ దేశంతో పోరాడేందుకు నిరాకరించారు. తమ ప్రభుత్వాలు సోవియట్ రష్యాలో జోక్యాన్ని మానుకోవాలని వారు కోరారు.

## ప్రజా విజయం

అన్నింటిలోకీ 1919వ సంవత్సరం సోవియట్ రష్యాకి గడ్డు సంవత్సరం.

ఆ సంవత్సరం వసంతకాలం మొదట్లో కోల్చక్ దండయాత్ర ప్రారంభించాడు. అతడు సైబీరియానుంచి కదలి, ఊరల్ పర్వతాలుదాటి ఓల్గా నదిని సమీపిస్తున్నాడు. పడమట, బాల్టిక్ ప్రాంతాలనుంచి యుడెనిచ్ వచ్చి, పెట్రోగ్రాడ్ మీద దాడి చేశాడు. బాల్టిక్‌లో సోవియట్ నౌకా స్థావరం క్రోన్‌స్టాట్‌ని బ్రిటిష్ నౌకా దళం సమీపించింది. అంటే, పెట్రోగ్రాడ్‌ని సమీపించింది. అన్నిటికన్నా చివర చెపుతున్నా, ప్రాధాన్యతలో దేనికీ తీసిపోని సంఘటన — పచ్చి ద్రోహం ఒకటి — పెట్రోగ్రాడ్ మార్గాలను రక్షిస్తున్న నౌకా స్థావరాల్లో జరిగింది. అక్కడ విప్లవ ప్రతికూలమయిన తిరుగుబాటు ఒకటి జరిగింది.

పట్టుదలతో చర్యలు తీసుకోటమే కాక, ప్రజల్లో అకుంఠిత దీక్ష అవసరమయింది. ఇవి ఉద్భవించినై కూడా. ప్రజలు అపూర్వమయిన ఉత్సాహశక్తి చూపి, అసాధ్యమనుకున్నవాటిని సాధించారు. బ్రిటిష్ వాళ్ళు సోవియట్ జలాల్ని వదిలిపెట్టి వెళ్ళిపోయినారు. ఎదురు తిరిగిన నౌకా స్థావరాలను, సముద్రం మీదనుంచి ముఖాముఖి దాడి చేసి, ఆక్రమించుకోటం జరిగింది. పెట్రోగ్రాడ్ కోట గోడల దగ్గరే యుడెనిచ్‌ని నిర్మూలించటం జరిగింది. తూర్పు రంగంలో, నాలుగు లక్షల బలంతో వచ్చిన కోల్చక్ సైన్యం వెనకాతటం మొదలు పెట్టింది.

ఇక్కడ, కోల్చక్‌తో జరిగిన పోరాటాల్లోనే, ప్రఖ్యాత వీరుడు వాసిలీ చెపయేవ్, అతని ప్రఖ్యాత దళం, అజరామరమయిన కీర్తి సంపాదించారు.

భవిష్యత్తును తెల్పివేసినటువంటి ఉఫా యుద్ధంలో చెపయేవ్ దళం అగ్రశ్రేణిలో వుంది. వైట్ గార్డులు వారిమీద ఎదురు దాడి చేశారు. ఘటం ఘటం రాచుకుంటూ, అభేద్యంగా శ్రేణులు తీర్చి, వైట్ గార్డులు ముందుకు రావటం సాగించారు. అది ఎర్ర సేనలను మానసికంగా దెబ్బ తీసేందుకు జరిగిన దాడి. చెపయేవ్ దళం మర ఫిరంగులు కాల్చటం ప్రారంభించింది. వైట్ గార్డులు కుప్పలు కుప్పలుగా కూలిపోతున్నారు; కాని దాడి కొనసాగుతూనే వుంది. అడ్డగించటానికి సాధ్యంకాని, భయంకరమయిన గోడ ముందుకు నడిచి వస్తున్నట్లుగా, వైట్ గార్డులు దాడి సాగించారు. చెపయేవ్ దళం వెనకంజ వేస్తుందని వాళ్ళు అనుకున్నారుకాని, ఎర్ర సైనికులు దృఢంగా నిలబడి, దాడిని ఎదుర్కొన్నారు. శత్రువుల దాడి నిలిచిపోయింది. ఎర్ర సైనికులు పెద్దపెట్టున ఉత్సాహ ఘోష చేస్తూ, శత్రువును వెంటపడి తరిమారు.

1919 చివరినాటికి కోల్చక్ సైన్యం సైబీరియాకు ఉపసంహ

సెకండ్ ఇంటర్నేషనల్ సైనిక



రించుకుంది. దాన్ని అక్కడ పూర్తిగా నిర్మూలించటం జరిగింది. అప్పుడక్కడి ప్రజలు మళ్ళీ కొత్తపాట కట్టారు :

దుష్ట డాబు ఆరిపోయె
భుజకీర్తులు మాయమయ్యె
కనిపించదు పొగాకసలు
తీరిపోయె కోల్చక్ పని.

సైబీరియా తిరిగి సోవియట్ ప్రాంతమయింది.

## తప్పిపోయిన జోస్యం

కోల్చక్ పూర్తిగా ఓడిపోవటానికి కొంచెముందుగా, 1919 వేసంగిలో సోవియట్ రష్యామీద మరొక కొత్త దండయాత్ర ప్రారంభమైంది. "వైట్" సేనలు దక్షిణంనుంచి, క్రిమియా, డాన్ నదీ ప్రాంతాలనుంచి, పైకిరావటం మొదలుపెట్టారు. జనరల్ డెనికిన్ ఈ సేనలకు ఆధిపత్యం వహించాడు. బ్రిటిష్, అమెరికా సామ్రాజ్యవాదులు ఇప్పుడు తమ ఆశలన్నిటినీ డెనికిన్ మీదనే కేంద్రీకరించుకున్నారు. లక్షమందికి పైగా వున్న డెనికిన్ సేనకి వారు ఆయుధాలను, సామగ్రినీ పూర్తిగా సప్లయి చేశారు.

"వైట్" సేనలు ఉక్రేన్ గుండా నడుస్తూ, ఓరెల్ పట్టణాన్ని ఆక్రమించుకున్నాయ్, 'తులా' నగరాన్ని సమీపిస్తున్నాయ్. మాస్కో నగరం ఫలానా రోజున, ఫలానా గంటకు పడిపోతుందని విదేశీ రాజకీయజ్ఞులూ, పత్రికా రచయితలూ జోస్యాలు చెప్పారు. మాస్కోలో మొట్టమొదట ప్రవేశించే పటాలానికి పదిలక్షల రూబుల్స్ బహుమానం ఇస్తారని ప్రకటించటం కూడా జరిగింది.

ఆందోళనాకరమైన ఆ రోజుల్లో, "డెనికిన్‌ని ప్రతిఘటించేందుకు తమ సర్వస్వం అర్పించాల"ని ప్రజలకు కమ్యూనిస్టు పార్టీ విజ్ఞప్తిచేసింది. అత్యంత అనుభవంకల బోల్షివిక్కులను సైన్యంలోకి పంపించారు. కామ్సొమోల్ సంఘాలన్నిటి తలుపులమీదా, "సంఘం మూసివేశారు; ప్రతిఒక్కడూ యుద్ధరంగంలో వున్నారు" అని వ్రాసివుంది.

డెనికిన్‌తో జరిగిన పోరాటాల్లో సెమ్యాన్ బుద్యోన్నీ నాయకత్వాన పోరాడిన మొదటి అశ్విక సైన్యం శాశ్వత కీర్తి సంపాదించింది. ఒక్కుమ్మడిగా ఈ అశ్విక సైన్యం జరిపిన దాడితో, శత్రుశ్రేణి భేదించపడింది. మొదటి అశ్విక సైన్యం శత్రుశ్రేణిలో గండికొట్టి, వారిని ఛేదించుకుంటూ, వారి వెనకాలకు వెళ్ళారు. 1919 అక్టోబర్ రెండో భాగంలో ఓరెల్ దగ్గరా, వొరొనెజ్ దగ్గరా, జరిగిన పోరాటాల్లో డెనికిన్ దళాల్ని చాలావరకు చుట్టుముట్టి, నిర్మూలించటం జరిగింది. బతికిబయటపడ్డవారు క్రిమియాకి పారిపోయినారు.

## శత్రువులకు సముద్రమే శరణ్యం

1920లో కొత్త పోరాటాలు జరిగినై. జనరల్ రాంగెల్ క్రిమియానుంచి దండయాత్ర సాగించాడు. ఈసారికూడా సామ్రాజ్యవాదులు డబ్బుకి లెక్కపెట్టలేదు. రాంగెల్‌కి విమానాలూ, టాంకులూ సప్లయిచేశారు.

లెనిన్ సలహామీద, దక్షిణరంగం ఆధిపత్యం మిఖేల్ ఫ్రుంజ్‌కి అప్పగించారు. ఫ్రుంజ్ చాలాకాలంనుంచీ బోల్షివిక్‌గా ఉంటూ, అనేక రహస్య సంస్థల్లో పనిచేశాడు. అతడే అంతర్యుద్ధంలో ప్రముఖ సేనానిగా తయారయినాడు. ఓల్గానది మీదనూ, యూరల్ పర్వతాల దగ్గరా, కోల్చక్‌ని ఓడించిందీ, కజఖ్‌స్తాన్‌కి విముక్తి కలిగించిందీ అతనే. అతనే మధ్యఆసియాలోనుంచి బ్రిటిష్ సైన్యం దాడులను తరిమివేశాడు.

ఈసారి వైట్ సేనలతో ప్రధానయుద్ధం డ్నీపర్ నదిఒడ్డున, కాఖోవ్కా అనేచోట జరిగింది. ఆ ప్రదేశంలోనే, ఓ అతిగొప్ప జల విద్యుత్కేంద్రాల్లో ఒకదానికి సంబంధించిన ఆనకట్టా, సోవియట్ ప్రజలు నిర్మించిన కాఖోవ్కా సముద్రం వున్నాయ్. ఈ పోరాటంలోకూడా వైట్ సేనలు మళ్ళీ ఓడిపోయినై. శత్రువులను వెంటాడి, క్రిమియాలోకి తరుముకుపొమ్మని ఫ్రుంజ్ తన సేనలకు ఉత్తరువు చేశాడు.

అయితే, వైట్ సేనలు పెరెకాప్ అనేచోట గట్టిస్థావరాలు ఏర్పరచుకున్నాయ్. పెరెకాప్ అనేది క్రిమియా ద్వీపకల్పాన్ని ప్రధానభూభాగంతో కలిపే సన్నటి భూసంధి. ఈ భూసంధి వెడల్పు 8 కిలోమీటర్లే. ఈ మార్గానికి అడ్డంగా, 8 కిలోమీటర్ల పొడుగునా, సముద్రంనుంచి సముద్రానికి, టర్కిష్ బురుజులు ఇరవై మీటర్లు ఎత్తుగా నిర్మించి వున్నాయ్. ఈ బురుజుల ముందు లోతయిన కందకం, బురుజులమీద రెండువందల ఫిరంగులూ వున్నాయ్. భూసంధి ప్రాంతంఅంతా ముళ్ళతీగెలతో దట్టంగా కంచెలువేశారు. ఈ శ్రేణికి కొంచం దక్షిణంగా ఇటువంటిదే మరొకశ్రేణి, ఇంత బలిష్టంగానూ, ఇంత అనుకూలంగానూ నిర్మించబడింది. ఇక్కడ శత్రువులు కొద్దిపాటి బలంతోనే, చాలాకాలం పోరాడవచ్చు.

భూసంధిమీదుగా క్రిమియాలోకి ప్రవేశించటానికి బదులుగా, పక్కన, అట్టే లోతులేనటువంటి సివాష్ అఖాతంలోనుంచి వెళ్ళేందుకు ఎర్రసేనలు నిశ్చయించినై. కొన్ని చోట్ల యీ అఖాతాన్ని కాలినడకన దాటవచ్చునుకాని, అప్పుడప్పుడూ నీటిమట్టం పెరిగి, ముంచివేసే ప్రమాదం వుంది. అయినా లెక్కచేయకుండా, ఎర్ర సైనికులు నిర్భయంగా నీళ్ళలోకి దిగారు. గుండెలవరకూ, నడుములవరకూ

ప్రాచ్య రంగానికి తరలిపోతున్న దృశ్యం 1919



స్తున్న మంచులాంటి ఆ నీళ్ళలో వాళ్ళు ముందుకు సాగారు. ఫిరంగులనీ, మరతుపాకులనీ, మందుగుండు సామగ్రినీ, చిన్న చిన్న తెప్పలమీద పెట్టి, లాక్కుంటూ, ముందుకు సాగారు. 1920 సంవత్సరం నవంబర్ నెలలో ఎర్ర సైన్యం క్రిమియామీదికి విరుచుకుపడింది. భయవిహ్వాలులయిపోయిన వైట్ సేనలు నల్ల సముద్రం ఒడ్డుకు తగ్గిపోయినై. నిర్మూలం కాగా మిగిలిన సేనలు ఓడ లెక్కి, రష్యానుంచి పారిపోయినై.

అంతర్యుద్ధం ముగింపుకు వస్తున్నది.

## అద్భుత గాధ

బాల్యావస్థలో వున్న సోవియట్ రాజ్యాన్ని దోపిడీదారులయిన సామ్రాజ్యవాదులు యుద్ధంలోకి ఈడ్చటం, ప్రజలకు గొప్ప నష్టంగా పరిణమించింది. రష్యాలో విప్లవ ప్రతికూల తిరుగుబాటును ప్రోత్సహించింది విదేశ సామ్రాజ్యవాదులే. తుపాకులతోనూ, మోసంతోనూ, ఆకలి అనే కఠోర హస్తంతోనూ సోవియట్ రష్యాను హతమార్చటానికి శక్తివంచనలేకుండా కృషిచేసింది వాళ్ళే.

పధ్నాలుగు విదేశాలూ, వేలకొద్ది దేశద్రోహులు మా దేశాన్ని కబళించటానికి ప్రయత్నించారు. అంతా తలాఒక వైపునా చీల్చి వేసేందుకు ప్రయత్నించారు. అయినా, సోవియట్ రష్యా గట్టిగా నిలబడింది. వీటన్నిటినీ తట్టుకుని బయటపడింది. ఇదొక అద్భుత గాధ. ఇది విదేశీ యుద్ధతంత్రజ్ఞులకు ఇంకా విస్మయం కలిగిస్తూనే వుంది.

రష్యా నిలబడగలిగిందీ అంటే, దానికి కారణం, సోవియట్ అధికారాన్ని రక్షించటానికి లక్షలాది రష్యన్ పుత్రులు నడుం కట్టారు. విప్లవాగ్నిలో ఉద్భవించిన కార్మిక, కర్షక సౌభ్రాతృత్వం అంతర్యుద్ధంలో మరింత గాకలు తీరింది.

రష్యా నిలబడగలిగిందీ అంటే, దీనికి కారణం ప్రపంచములో ఉత్తమ ప్రజలంతా, ముఖ్యంగా ఇతర దేశాల్లో కార్మికులూ, కర్షకులూ, రష్యాను అభిమానించారు కనుక.

గొప్ప వ్యవస్థకు ఆదర్శం చూపించారు కనుకనే, సోవియట్ ప్రజలు జయించారు. ఈ ప్రజానీకాన్ని సన్నాహపరచింది కమ్యూనిస్టుపార్టీ. విజయాలనుంచి విజయాలకు వారిని నడిపింది కమ్యూనిస్టుపార్టీ. కమ్యూనిస్టుపార్టీ ప్రజల్ని అధికారంలోకి తీసుకురావటమే కాకుండా, ఆ అధికారం నిలబెట్టుకొనటంలో తోడ్పడింది.

కాలం ముందుకు సాగిపోతుంది. చరిత్ర కాలవిరుద్ధంగా నడవదు.

## (మహాకృషి) మహోద్యమ ప్రారంభం

ప్రపంచయుద్ధం, ఆ తరవాత వచ్చిన అంతర్యుద్ధం మొత్తం పదేళ్ళపాటు సాగినై. లక్షలకొద్ది చదరపు కిలోమీటర్ల మేర ఆక్రమించిన రష్యా అంతా, కాగి చల్లారిన కాదుమోస్తరు వియార్లైంది —పనిలేకుండా పడివున్న ఫ్యాక్టరీలూ, నీళ్ళునిండిన గనులూ, ధ్వంసమయిన వంతెనలూ, రైలుమార్గాలూ ఎక్కడచూసినా కన్నుచూపు మేర దాటేవరకూ, గడ్డిగాదం పెరిగి కలుపుతొక్కిన పొలాలూ, తగలబడిన గ్రామాలూ, ధ్వంసమయిన నగరాలూ కనిపించినై.

అన్నిటికన్నా భయంకర దృశ్యం మరొకటి వుంది. చింకిరి గుడ్డలతో, ఎండిపోయిన దేహాలతో, గుంపులు గుంపులుగా పిల్లలు, యుద్ధంవల్ల నిరాశ్రయులై కనిపించారు. వాళ్ళు రష్యా అంతట్లోనూ తిరుగుతూ, దుకాణాల వైపుకి తమ ఆకలి కళ్ళను నిగుడించేవాళ్ళు. కాని దుకాణాలు కూడా ఖాళీనే.

టైఫస్ వ్యాధి గ్రస్తులకు ప్రత్యేకించిన ఇళ్ళలో వందలకొద్ది జనం పడివుండే వాళ్ళు. రష్యాలో యెక్కడ చూసినా సిలువలు, సిలువలు, సిలువలు—అంతా సిలువ మయం,

గ్రామాలు కోరినై బట్ట
నగరాలు అడిగినై రొట్టె
ఫ్యాక్టరీ కవసరం బొగ్గు
ఎటుచూసినా వుంది బుగ్గి
నాశనం, ఆకలీ....

దేశాన్ని తిరిగీ నిర్మించటానికి కార్మికులు, కర్షకులూ, నాలుగేళ్ళపాటు నిరంతర కృషి చేశారు. సాధ్యమైనంత త్వరలో తమ ఆర్థిక వ్యవస్థ బాగు చేసేందుకు, జీతం లేకుండానే, శని, ఆదివారాలు పనిచేశారు. తీరిక సమయాల్లో కట్టెలు బళ్ళకి ఎత్తేవాళ్ళు, రైలు మార్గాలని బాగు చేసేవాళ్ళు; వీధులని శుభ్రపరిచేవాళ్ళు—అన్నీ జీతం లేకుండానే చేశారు. ప్రతివాళ్ళు శనివారాలు పనికి వచ్చేవాళ్ళు....శనివారం చేసే పనిలో లెనిన్‌కూడా పాల్గొన్నారు. పని చేయటంలో ప్రజలు ప్రదర్శించిన ఈ ఉత్సాహానికి ఆయన "మహా కృషి ప్రారంభం"అని పేరు పెట్టారు.

యుద్ధంవల్ల నాశనమయిన ఫ్యాక్టరీలన్నిటినీ బాగు చేశారు. రైతులు వదిలేసిన పొలాల్లో, కొద్దికాలానికే గోధుమ, రై మొక్కలు తలలెత్తినై. తిరిగీ నిర్మించిన రైలు మార్గాలమీద, నిండా సరుకులు వేసుకుని రైళ్లు పరుగెత్తటం ప్రారంభించినై.

కార్మిక జనాభాని ఇప్పుడు కొత్త సమస్య ఎదుర్కొంది. వెనకపడి, అలసంగా వున్న రష్యాని ముందడుగు వేసిన కార్మిక కర్షక రాజ్యంగా రూపొందించటమే ఆ సమస్య.

## "మానవుడి పాట్లు"

అన్నది, సుప్రసిద్ధ రష్యన్ రచయిత మిఖైల్ షొలొకోవ్ విరచించిన, విఖ్యాత బృహత్కథానికకు శీర్షిక, అది సమగ్రంగా మా పత్రికలో వెలువడగలదని ప్రకటించడానికి మేము ఎంతో ఉత్సహిస్తున్నాము. ప్రథమ ఖండం రాబోవు సంచికలో వెలువడుతుంది.

"ఒక గ్రామపు చరిత్ర" అన్న శీర్షికతో రాబోవు సంచికలో రానున్న వ్యాసం, విప్లవానికి పూర్వం పతనమవుతున్న ఒక పల్లెపట్టు, సోవియట్ పరిపాలనలో ఎట్లా పచ్చ పచ్చగా సిరిసంపదల కాటపట్టుగా పరివర్తించబడినదో హృదయంగమంగా వర్ణిస్తుంది.

నాలుగు-పుటల వర్ణచిత్రానుబంధం యీ రానున్న సంచికకు మరొక విశేషాకర్షణ,

**మీ ప్రతికై త్వరపడండి!**

# అమెరికన్ పత్రికా రచనల సమీక్ష



ఒ. వాసిల్యేవ్

అమెరికన్ పాలకవర్గాల పత్రికలు ఈ మధ్యవరకు ఆసియాలోని అమెరికన్ విదేశాంగ విధానాన్ని గురించి మొత్తంమీద సంతృప్తిని వెళ్ళబుచ్చుతూనే వచ్చాయి. కాని ఇప్పుడు ఎవరైనా జాగ్రత్తగా అమెరికన్ పత్రికలను చదివినట్లయితే పరిస్థితులు పూర్తిగా మారిపోయినట్లు తెలియవస్తుంది. ఆసియాలో అమెరికన్ విధానం పట్ల ఆగ్రహాన్ని చూపుతూ, ఆ విధానాన్ని పునఃపరిశీలన చేయమని కోరడము అధికంగా జరుగుతున్నది. అందులోను ముఖ్యంగా ఈ మధ్య జరిగిన సంఘటనల విషయంలో ఇది బాగా ద్యోతక మవుతుంది: తైవాన్‌లోని అమెరికన్ వ్యతిరేక ప్రదర్శనలు, బ్రిటన్, మరికొన్ని దేశాలు చైనాతో పెట్టుకొన్న వ్యాపార నిర్బంధాలను రద్దు చేయడము అలాంటి సంఘటనలు.

తైవాన్ సంఘటనల అనంతరం ఆసియాలోని అనేకదేశాలలో అమెరికా వ్యతిరేక గాలి దుమారం ఒకటి లేచినమాట అందరికీ గుర్తే. అది అమెరికన్ ప్రజలపైన గొప్పప్రభావాన్ని కలుగజేసింది. అమెరికా విదేశాంగ విధానం అపజయాలను పొందుతున్నట్లు చాలా మంది గ్రహించసాగారు. న్యూ రిపబ్లిక్ అన్న పత్రిక యిలా వ్రాసింది. "ఈ విధానం ఇప్పుడు పరీక్షకు లోనవుతున్నది. ఫార్మోజాలోని మే 24న జరిగిన సంఘటనలు యీ విధానాన్ని పూర్తిగా పటాపంచలు చేసేస్తాయనే అనవచ్చును. సూక్ష్మంలో చెప్పాలంటే ఆసియాపట్ల తన వైఖరిని అమెరికా పూర్తిగా పునఃపరిశీలన చేసుకొనవలసివుంటుంది."

ఏమి జరిగింది? ప్రస్తుత పరిస్థితికి కారణం యేమిటి? అత్యంత పలుకుబడిగల పత్రికల్లో ఒకటయిన న్యూయార్క్ టైమ్స్ పత్రిక యొక్క టోకియో విలేఖరి మిస్టర్ ట్రుంబెల్ ఆ పత్రికలో వ్రాసిన ఒక సుదీర్ఘ వ్యాసంలో, ఈ ఆసియాదేశాలలో తాను ప్రీతితో చూడబడుతున్నానని అనుకోగలిగినట్లయితే, అతడు అసాధారణమైన వ్యక్తి అయి వుండాలని ఉల్లేఖించాడు. అమెరికన్ సైన్యాలు ఎక్కడెక్కడైతే ఉంచబడుతున్నాయో ఆ ప్రాంతాలలో, సాధారణంగా వాటి రాక ఆ ప్రాంతపు ప్రజల జాతీయ గౌరవానికి భంగం కలిగించే సంఘటనతో సంబంధం కలిగివుండడంవల్ల, ద్వేషించబడుతున్నాయి. "ప్రచ్ఛన్న యుద్ధం" ప్రారంభం అయినది లగాయతు అమెరికా అవలంబిస్తూ వచ్చిన వ్యూహం ఇప్పుడు పునఃపరిశీలన గావింపబడాలని న్యూయార్క్ టైమ్స్ పత్రిక అటు తర్వాత వ్రాసింది. ప్రభుత్వ విధానాన్ని బలపర్చే న్యూయార్క్ టైమ్స్ లాంటి ప్రముఖ వార్తా పత్రిక యీ విధంగా డిమాండు చేసిందంటే, అది విశిష్ట ప్రాముఖ్యతను కలిగి వుంటుంది.

బహుశ అన్నిటికంటే ఆసక్తిదాయకము, సుబోధకము అయిన విషయము మనకు చికాగో డెయిలీ న్యూస్ అన్న పత్రికలో అగుపడుతుంది. ఈ పత్రికలో ప్రకటింపబడిన ఒక వ్యాసము ప్రభుత్వ వర్గాల దృష్టి నాకర్షించడమేగాక "కాంగ్రేషనల్ రికార్డు"లో గూడా ప్రకటింపబడింది. ఆపత్రిక టోకియో విలేఖరి మిస్టర్ బీచ్ ఆసియా దేశాలగుండా పర్యటిస్తున్న సందర్భంలో యీ విషయాలను గమనించాడు: ఒకినావా ప్రజలు, జపానులోని అత్యంత పెద్ద నగరానికి ఒక కమ్యూనిస్టుని మేయర్‌గా ఎన్నుకొని అమెరికన్ సైనిక పరిపాలన పట్ల తమ అసంతృప్తిని ప్రకటించారు; అమెరికన్ సైనిక స్థావరాల విషయంలో జరుగుతూ ఉండిన సంప్రదింపులు విఫలమయ్యాయి; అమెరికాతో వున్న పరస్పర రక్షణ ఒడంబడిక జపానుకు అననుకూలంగా వున్నది గాబట్టి అది రద్దు గావింపబడడమో, లేక మౌలికంగా మార్పులు చేయబడడమో జరుగాలని జపానులో పదే పదే డిమాండు చేయబడుతున్నది.

ఈ చికాగో వార్తాపత్రిక ఈ విషయాలనుబట్టి కొన్ని ముఖ్యమైన నిశ్చితాభిప్రాయాలకు వచ్చింది. తైవాన్‌లోని సంఘటనలు, ఆసియాలో తాము పరదేశీయుల మన్న వాస్తవ విషయాన్ని గౌరవనీయులైన అమెరికన్‌లు మరిచిపోతుంటారన్న సంగతిని బాహాటంగా వెల్లడిస్తున్నాయి; ఆసియా ఖచ్చితమైన శాంతియుత మార్గాన్ని అవలంభించడం ప్రారంభించిన తర్వాత విదేశాలలో అమెరికన్ సైన్యాల ఉనికిని సమర్థించడం కష్టతరమైపోతున్నది.

అమెరికన్ సహాయం అనబడే దానియొక్క స్వార్థ దృష్టి లక్షలాది ఆసియా ప్రజలకు నేడు సువ్యక్తమయింది. అందువల్లనే అనేక ఆసియా దేశాలు ఈ విషయంలో బహు జాగరూకతతో వ్యవహరిస్తున్నాయి. "సహాయ" కార్యక్రమం ఇంకా కొనసాగింపబడుతున్నందుకు దానికి వ్యతిరేకంగా విమర్శాత్మక ప్రకటనలు, ఆక్షేపణలు గూడా తరుచు అమెరికన్ పత్రికలలో కనబడుతూ ఉన్నాయంటే అది కాకతాళీయంగా జరుగుతున్న విషయం మాత్రం కాదు. ఆసియా దేశాలకు "సహాయం" చేసే కార్యక్రమాన్ని విమర్శిస్తూ రిచ్‌మండ్ న్యూస్ లీడర్ అనే పత్రిక ఇలా వ్రాసింది: వాషింగ్‌టన్‌లో ఇప్పుడు బాగా ప్రచారంలో ఉన్న పదజాలాన్ని ఉపయోగించాలంటే, మనం ఇంకా ప్రపంచమంతటా "ప్రేమను కొనుక్కొంటు"న్నాము. ఈ విధానం ప్రమాదానికి దారితీస్తుంది. అట్టి విధానాన్ని పరిత్యజించవలసిన సమయమాసన్నమయినది.

అమెరికన్ విదేశాంగ విధానం పునఃపరిశీలింపబడాలని అమెరికన్ పత్రికలలో జరిగే ప్రచారంలో తరుచు చైనా సమస్య ప్రస్తావింపబడుతూ ఉంటుంది. పుట్టిన తొమ్మిదవ రోజున కండ్లుతెరిచే పిల్లికూనలవలె, అమెరికన్లు. చైనాపట్ల వాషింగ్‌టన్ 1919 మొదలుకొని అవలంభిస్తూవచ్చిన విధానం యొక్క దివాలాకోరుతనాన్ని ఇప్పుడు గుర్తిస్తున్నారని నేషన్ అనేపత్రిక వ్రాసింది. ప్రసిద్ధ అమెరికన్ పత్రికావిలేఖరి వాల్టర్ లిప్‌మన్, చైనా పట్ల అమెరికా అనుసరించే విధానం అనర్థదాయకంగా ఉన్నదని ఒప్పుకొనవలసి వచ్చింది.

ఈ విధానాన్ని పూర్తిగా పునఃపరిశీలన గావించి, ప్రపంచపు ఆ భాగానికి సంబంధించిన సమాచార సమస్య విషయంలో నూతన దృక్పథాన్ని అవలంభించాలన్నదే నేటి ప్రజాభిప్రాయం. అంటూ ఇంతవరకు ప్రభుత్వ విధానాన్ని బేషరతుగా బలపరుస్తూ వచ్చిన క్రిస్టియన్ సైన్స్ మానీటర్ అనే పత్రిక వ్రాసింది.

ఆసియాలో అమెరికా విధానం పునఃపరిశీలన గావింపబడాలని అమెరికన్ పత్రికలలోను, ప్రముఖ అమెరికన్ పత్రికా రచయితల వ్యాఖ్యానాలలోను నొక్కి చెప్పబడుతున్నది. అనేక వార్తాపత్రికలకు, మ్యాగజైన్లకు సరికొత్తదైన యీ విషయమే ఇప్పుడు ప్రధానాంశంగా ఉంటున్నది.



# భావి నావికుడు

సముద్రం అన్నా, అంతరిక్షమన్నా ప్రజల మనస్సులలో ఒక విధ మైన ఆకర్షణ కలుగుతుంది. ఎన్నెన్నో శతాబ్దాలుగా సముద్ర యానమంటే సుదూర దేశాలకు యాత్రగాను, వింత వింత ప్రజలు, ప్రదేశాల సందర్శనంగాను, సాహస కృత్యాలు చేయడంగాను పరిగణింపబడుతూ వచ్చింది. ముఖ్యంగా బాలలు నావికులను, వారి నావికా దుస్తులను చూచి ఆకర్షితు లవుతుంటారు.

ఈ ఆకర్షణ సోవియట్ బాలలకుకూడా లేకపోలేదు. తమ జీవితమంతా నేలమీదనే గడిపిన వయోజనులుగూడా యీ ఆకర్షణకు గురికాక మానరు.

కాబట్టి, మాస్కోవా నదిలో వయ్యారంగా తేలియాడుతున్న ఒక తెల్లని

నావికుని సేవ ప్రశంసార్హమవుతుంది.



"ఓడవాసులారా, సెలవు, ఇహ మేము సముద్రయాత్రకు పోతున్నాం!"

లాంచిని చూడడానికి మాస్కో వాసులు ఎంతో ఆసక్తిని చూపారంటే ఆశ్చర్యపడవలసిన విషయమేమీ వుండదు. కాని ప్రజలను అంతగా ఆకర్షించిన పడవలో ఒక అసాధారణత లేకపోలేదు.

ఆ పడవయొక్క పై డెక్కు, స్టీయరూము ప్రయాణీకులతో కిటకిట లాడుతున్నాయి. వారంతా బాలలే. కాని రేవులోవున్న జనాన్ని ఆకర్షిస్తున్న విషయం ఏమిటంటే, ప్రయాణీకుల వయస్సులోనే వున్న నావికులు, వారు నావికుల దుస్తులు ధరించి వున్నారు. నావ కంతటికీ ముఖ్యుడైన "సొత్కా" మ్యాన్‌కు గూడా 15 సంవత్సరాలకు మించి వుండవు.

...మాస్కో పాఠశాలకు చెందిన సాషా ఆలిషెరెంకో అనే ఒక విద్యార్థి తాను నావికుడు కావాలని ఎల్లప్పుడూ కలలు కంటుండేవాడు. ఎప్పుడైనా తాను

నావికుడు కావాలని ఆశించేటట్లయితే "బాలల నౌకా సంస్థ"లో చేరవచ్చునని తెలియజేసే ఒక ప్రకటనను సాషా వాళ్ళ పాఠశాల నోటీసు బోర్డుమీద చూచాడు. గత వసంతకాలంలో మాస్కోలోని పాఠశాలల్లో ఆకర్షవంతమైన ఈ ప్రకటన చేయబడింది.



పనిమీదవున్న వార్తావహుడు: లంగరు వెయ్యడానికి సన్నద్ధం చెయ్యండి!"

వందలాది ఇతర విద్యార్థులవలెనే సాషా కూడా యే పస యేమాత్రమూ లేకుండా నిర్ణీత దినంనాడు "వాలంటీరు"గా సంసిద్ధుడయ్యాడు. అసలు నావికాయానం అంటే యేమిటో అతనికి సరిగ్గా తెలియదు. దాని విషయం మాత్రం పుట్టూ వచ్చింది. చివరికంతా రసాభాస మవుతుందేమోనని. తీరా అతనిని యేదైనా ఒక జలక్రీడల కేంద్రంలో చేరమంటారేమోనని అనుమానం కలిగింది. అందువల్ల ఊపిరి బిగబట్టుకొని "రిక్రూటింగ్ కేంద్రానికి" వెళ్ళాడు. కాని అక్కడ జరిగిన విషయం అతనిని ఆశ్చర్య చకితుడ్ని చేసింది. ఆ విషయాన్ని నమ్మలేక కళ్ళు నలుపుకొని మరీ చూచాడు. అతని కళ్ళముందు తెల్లని రెండు లాంచీలు–"స్మెలీ", "మిర్నీ" అన్నవి–ప్రత్యక్ష మయ్యాయి.

ఇంజన్లో ఏదో అస్తుతగుల్తున్నది.



సన్నగా ఉన్న ఒక నడివయస్సుమనిషి కంఠం సాషాను ఆలోచనా ప్రపంచంనుంచి బయటికి తీసుక వచ్చింది. ఆ సన్నని వ్యక్తే కెప్టెన్ అని తెలిసింది. ఇతరులతోపాటు సాషా ముందుకు కదిలి ఆ సంఘాన్ని గురించీ, దానియొక్క ఉద్దేశ్యాలను గురించి కెప్టెన్ చెప్పే విషయాలను విన్నాడు.

బాలల రైల్వే ప్రాతిపదికమీదనే యీ సంస్థకూడా యేర్పాటు చేయబడిందని కెప్టెన్ చెప్పాడు. క్రీడాసమయంలోనే వారంతా ప్రవీణుల ఆధ్వర్యంలో నావికుల పనులన్నింటినీ నేర్చుకొంటారని ఆయన అన్నాడు. తాము చూస్తున్న లాంచీలు 80 హార్స్‌పవర్ సిలిండ్రికల్ మోటార్లతో అమర్చబడి ఉన్నాయని, గంటకు 18-20

నూతన నావికుల దేశంలో ఒక స్త్రీ ఘట్టం



కిలోమీటర్ల వేగంతో ప్రయాణం చేయగలవని ఆ బాలలు తెలుసుకొన్నారు. ఆ లాంచీలు, వాటితో పనిచేసే నావికులనుగాక, 125 మంది ప్రయాణీకులను తీసుకొని పోగలవు. కాని, బాలలు నడపడానికి అనువుగా యీ పడవలు ప్రత్యేకించి తయారు చేయబడ్డాయన్న విషయం వారిని అన్ని విషయాలకంటే యెక్కువగా ఆకర్షించింది.



ఇవ్వాళ ప్రయాణీకులు అధికంగా ఉన్నారు

జరిపే ప్రయాణాలు కాలువమీద మాత్రమే కాదు. వాగానికి రెండు పర్యాయాలు మాస్కో నదిపైని "దూరపు" ప్రాంతాలకు గూడా వెళుతుంటారు. బాలల నావికా సంస్థకు దాని సొంత జలక్రీడల కేంద్రం గూడా వున్నది. అక్కడ బాలలు ఈదడము, తెడ్లతో దోనెలను నడపడము నేర్చుకొంటారు.

కాని సాషాకు ఎక్కువ ఆనందాన్ని కలిగించేవి. కార్యక్రమంలో లేని ప్రత్యేక ప్రయాణాలు. ఆ ప్రయాణాల్లో లాంచిలను తీసుకొని పోయి, రమణీయమైన స్థలాలలో లంగరు వేసి. చేపలను పట్టడానికి "తీరానికి" వెళతుంటారు. సాయంత్రపు సమయాల్లో వెన్నెల్లో కూర్చొని. వంటలు చేసుకొంటూ. తమ పెద్దలు చెప్పే సముద్రయానపు సాహస గాధలను వింటుంటారు.

....పెద్దపెద్ద నావలను గురించి. మహా సముద్రాలలో యానాన్ని గురించి. తుఫానులను గురించి, దూరపు దేశాలను గురించి సాషా కలలు కంటున్నాడు. నావపైన నిలబడి. దానికి నాయకత్వం వహిస్తున్నట్లు ఊహించుకొంటుంటాడు....

దెక్కు. పెద్ద నౌకమీద ఎంత శుభ్రంగా వుంటుందో అంత శుభ్రంగా వుండాలి

....ఈ విధంగా సాషా నావికుడయ్యాడు. ఇప్పుడతడు. ఇతరులతోపాటు. నిజమైన నావికుల విధులను నెరవేర్చుతూ ఆ పెద్ద పడవను నడుపవలసి యున్నది.

వారి నావికాయాన కార్యక్రమం చాలా ఆసక్తిదాయకంగావున్నది. ఒక్కొక్క తడవ 80 మంది ప్రయాణీకులను తీసుకొని వారు రోజుకు నాలుగు ట్రిప్పులు చేస్తారు. వారు

# [illegible] సోవియట్ పరిశ్రమ

ప్రొఫెసర్ కొపెలెవ్

జార్ కాలపు రష్యా ప్రపంచదేశాలన్నిటికన్నా పెద్దది. పారిశ్రామిక ఉత్పత్తిలో మాత్రం యూరప్‌లో నాలుగోది. ఈ ఉత్పత్తి అమెరికా ఉత్పత్తికన్నా నూటికి 93.1 వంతులూ, బ్రిటన్‌కన్నా 77.8 వంతులూ, జర్మనీకన్నా 88.3 వంతులూ తక్కువ. రష్యా పరిశ్రమల్లో వాడుకలోనుంచి తొలగిపోయిన పాతకాలపు పనిముట్లూ, యంత్ర పరికరాలూ వుండేవి. ముడి పదార్థాల విషయంలో ఎంతో భాగ్యవంతమయిన యీ దేశం విదేశాల నుంచి యంత్రాలనే కాక, బొగ్గూ, లోహాలను కూడా దిగుమతి చేసుకునేది. పరిశ్రమలు చాలావాటిల్లో కీలక స్థానాలను విదేశీ పెట్టుబడిదారులు ఆక్రమించుకుని, జాతీయ పరిశ్రమ అభివృద్ధి కాకుండా అన్ని విధాలా ఆటంక పరిచేవారు.

విప్లవానంతరం, ప్రజలకు జార్ ప్రభుత్వం నుంచి లభించిన వారసత్వం యీ విధంగా వుంది. అంతేకాక, సోవియట్ పాలన మొదటి దశలో, విదేశీయుల జోక్యంవల్లనూ, అంతర్యుద్ధం వల్లనూ, ఈ పరిశ్రమలు కూడా చాలా వరకూ నాశనమయినై. 1920 లో తయారైన పారిశ్రామిక వస్తువులు విప్లవానికి ముందు తయారైన వాటికన్నా, నూటికి 80 వంతులు తక్కువ. యావన్మంది ప్రజయీ చేసిన బ్రహ్మాండమయిన ప్రయత్నాల ఫలితంగా, 1926 నాటికి మాత్రమే, 1913 సంవత్సరపు ఉత్పత్తిని అందుకోటం సాధ్యమైంది. అయితే ఈ ఉత్పత్తి, అర్థ వలసదేశానికి ఉండే అతి హీన స్థాయిలో మాత్రమే వుండి. ఆర్థిక స్వాతంత్ర్యం సాధించాలంటే, దేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధిపొందిన శక్తిగా తయారు చేయాలి. ఒక్కమాటలో చెప్పాలంటే, ఇరవై సంవత్సరాల తర్వాత భారతదేశం ఏ సమస్యని ఎదుర్కోవాల్సి వచ్చిందో, అప్పుడు సోవియట్ యూనియన్‌కూడా అదే సమస్యను ఎదుర్కోవాల్సి వచ్చింది.




## తొలిచర్యలు

భారీ పరిశ్రమలనూ, వాటికి మూలాధారమయిన యంత్ర నిర్మాణ పరిశ్రమనూ అభివృద్ధి చేసేందుకు కావలసిన అపారమయిన సాధన సంపత్తిని ఎక్కడ సంపాదించాలి అనే ప్రశ్న తక్షణమే ఏర్పడింది. సోవియట్ యూనియన్‌కి అప్పు ఇచ్చేందుకు ఒక్కదేశం కూడా అంగీకరించలేదు. అమెరికా, పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన యూరప్ దేశాలు అనుసరించిన పద్ధతిలోనే సోవియట్ యూనియన్‌కూడా, తన పరిశ్రమలు పెంపొందించాలంటే, దానికి చాలాకాలం పడుతుంది. ఆ దేశాలు అనుసరించిన పద్ధతి ఏమిటంటే, మొదట తేలిక పరిశ్రమలను నిర్మించి, వాటిమీద వచ్చిన లాభాలను భారీపరిశ్రమలో పెట్టుబడి పెట్టటం.

అందువల్ల, దేశానికి లోపలే, సాధన సంపత్తిని వెతుక్కోవలసి వచ్చింది. భూములమీదా, బ్యాంకులమీదా, ఫ్యాక్టరీలమీదా, స్వదేశ విదేశ వ్యాపారాలమీదా, వీటన్నిటిమీదా వచ్చిన ఆదాయమంతా, భారీ పరిశ్రమ నభివృద్ధి చేసేందుకు ఉపయోగించబడింది. సోవియట్ సామాన్య ప్రజలు తమ దేశ స్వాతంత్ర్యాన్ని బలపరిచేందుకు తమ సొంత ఖర్చులు స్వచ్ఛందంగా తగ్గించుకుని, విశేషంగా డబ్బు సమకూర్చారు. ప్రభుత్వ ఋణాలకు శ్రామిక జనం కూడా డబ్బిచ్చి, ఉత్పత్తి పథకాలను లక్ష్యాలను మించి అమలు జరిపేందుకు మహోత్సాహంతో పనిచేశారు. అవి చాలా గడ్డురోజులు. అయినా, వాటిని తలుచుకుంటేనే మాకు గర్వంగా వుంటుంది.

1928వ సంవత్సరంలో సోవియట్ యూనియన్ పరిశ్రమలు స్థాపించటానికి తాను వేసుకున్న కార్యక్రమాలను అమలు జరపటం ప్రారంభించింది.

## అయిదేళ్ల పథకాలు

అయిదేళ్ళ పథకం అనే మాట, 1930 ప్రాంతాల్లో, విదేశాల్లో అనుమానం మనుషులు అనేకమంది వెల్లడించిన సందేహాలు లెక్కచెయ్యకుండా, సోవియట్ ప్రజలు తమ పథకాలను ఆచరణలో పెట్టటానికి ఉద్యమించినప్పుడు, మొట్టమొదట సారిగా, వాడుకలోకి వచ్చింది.




ఈ సందర్భంలో టాగూర్ చెప్పింది ఉదహరించవచ్చు. ఆ మహాకవి 1930 లో సోవియట్ యూనియన్ సందర్శించారు. ఆయన ఈ విధంగా వ్రాశారు:

"ఈ విశాల భూభాగం మీద నవ్య ప్రపంచం ఒకటి సృష్టించటానికి వారు (సోవియట్ ప్రజలు-సం॥) నడుం కట్టి కృషిచేయటం చూస్తున్నాను. సాధ్యమయినంత తొందరగా, వారు తమ కాళ్ళమీద తాము నిలబడ గలగటం అవసరం. తాము దేనికోసమైతే పాటు పడుతున్నారో అది, పొరబాటు కాదనీ, బూటకం కాదనీ, అడుగడుక్కీ వారు నిరూపించాల్సి వుంది. వెయ్యేళ్ళ కాలాన్ని పది పదిహేనేళ్ళలోనే అధిగమించటానికి వారు పూర్తిగా సంకల్పించు కున్నారు. ఇతర దేశం దేనితో పోల్చినా, వారి ఆర్థికశక్తి లెక్క చేయవలసింది కాదు; అయితే, వారి సంకల్ప బలం మాత్రం బ్రహ్మాండ మయింది."

రెండో అయిదేళ్ళ ప్రణాళికనీ (1933-37), మొదటి ప్రణాళికనీ కూడా శ్రామికజనం అనుకున్నదానికి ముందే పూర్తి చేశారు. కొత్త యంత్ర విజ్ఞానం ఆధారంగా, జాతీయ ఆర్థిక

వ్యవస్థను పునర్నిర్మించటం, ముఖ్యంగా, ఈ కాలంలో పూర్తి అయింది.

—1937 నాటికి సోవియట్ యూనియన్‌లో భారీ పరిశ్రమల మొత్తం ఉత్పత్తి 1913 ఉత్పత్తికి ఎనిమిది రెట్లను మించింది. నూతన వ్యవస్థకు ఆర్థికంగా గట్టి పునాదులు వేశారు. 1937 నాటికి సోవియట్ యూనియన్ పారిశ్రామికంగా అత్యంతాభివృద్ధి పొందిన దేశాలనుకూడా, పారిశ్రామికాభివృద్ధి వేగంలో, ఎంతో దాటిపోయింది. 1940 సంవత్సరం వచ్చేటప్పటికి, సోవియట్ యూనియన్ ఏడాదికి కోటీ యాభై లక్షల టన్నుల ఇనుమూ, కోటి ఎనభై మూడు లక్షల టన్నుల ఉక్కూ, మూడుకోట్ల పదిలక్షల టన్నుల నూనే ఉత్పత్తి చేసింది. తొమ్మిదివేలకు పైగా పెద్దపెద్ద ప్రభుత్వ వ్యవస్థల నిర్మాణం పూర్తి అయి పనిచేయటం ప్రారంభించినై. వాటిల్లో మాగ్నిటో గోర్స్క్, కుజ్‌నెత్స్క్ వంటి బ్రహ్మాండమైన ఇనుము, ఉక్కు కర్మాగారాలు వున్నాయి. 1956 లో ఈ రెండు ఫ్యాక్టరీలలో ఉత్పత్తి అయిన




ఇనుము, మొత్తం జపాన్ అంతటా ఉత్పత్తి అయిన దానికి మించింది.

సగటున మనిషి ఒకరు సాధించే ఉత్పత్తిలో, ప్రధానమైన పెట్టుబడిదారీ దేశాలతో దీటు కావటం, ఈ సోవియట్ ప్రజలు లక్ష్యంగా పెట్టుకున్నారు.

అయితే, 1941 లో ఫాసిస్టు జర్మనీ దండయాత్ర సోవియట్ ప్రజల శాంతియుత నిర్మాణ కృషికి ఆటంకం కలిగించింది.

## విషమ పరీక్ష

1941 నుంచి 1945 వరకూ ఫాసిస్టు దురాక్రమణ పరులతో జరిపిన దేశరక్షణ మహాయుద్ధం సోవియట్ ప్రజలకి ఒక విషమ పరీక్ష. అకస్మాత్తుగా దాడి జరపటంవల్ల వచ్చే అవకాశాన్ని వినియోగించుకుని హిట్లర్ అనుచరులు సోవియట్ ప్రాంతంలో విశాలభాగాన్ని ఆక్రమించుకున్నారు.

అయినప్పటికీ, ఎంతో కష్టంగా వున్న యుద్ధ పరిస్థితుల్లో కూడా, సోవియట్ ప్రజలు, లక్షలకొద్దీ కార్మికులనూ, ఇంజనీర్లనూ, వందలకొద్దీ భారీ పరిశ్రమలనూ, యుద్ధరంగానికి చాలా దూరంగా, సైబీరియా, ఊరల్ ప్రాంతాలకి తరలించటమనే సాహస పథకాన్ని అమలు జరుప గలిగారు. 1300 కి పైగా కర్మాగారాలను తూర్పు ప్రాంతాలకు తర్లించారు.

అయినా కానీ, యుద్ధంవల్ల సోవియట్ పరిశ్రమకు విపరీతమయిన నష్టం కలిగింది. దురాక్రమణదారుల ప్రత్యక్ష చర్యలవల్ల జాతీయార్థిక వ్యవస్థకు కలిగిన నష్టం 67 900 కోట్ల రూబుల్స్ వుంది. యుద్ధంవల్ల, సోవియట్ ఆర్థికాభివృద్ధి దాదాపు పదేళ్ళు వెనకడుగు వేసింది. ప్రపంచంలో ఏ దేశమూ కూడా ఇంతగా నష్టపడలేదు. అయినప్పటికీ సోవియట్ యూనియన్, సోషలిస్టు ఆర్థిక వ్యవస్థలో వుండే సౌకర్యాలను ఉపయోగించుకుని, దెబ్బతిని పోయిన తన ఆర్థిక వ్యవస్థను యుద్ధానంతరం అయిదేళ్ళలోనూ, తిరిగి ప్రతిష్ఠించ గలిగింది.

1950 నాటికి పారిశ్రామికోత్పత్తి 1940 కన్నా నూటికి యాభై వంతులు పెరిగింది. నూనె ఉత్పత్తికి యుద్ధానికి ముందు స్థాయిని మించింది. ధ్వంసమైపోయిన విద్యుత్కేంద్రాలు అన్నిటినీ బాగుచేయటం, కొత్తవాటిని పని చేయించటం జరిగింది. ఈ పద్ధతిలో పెంపొందించిన పరిశ్రమల్లో తేలిక పరిశ్రమలూ ఆహార పరిశ్రమలు కూడా వున్నాయి. మొత్తంమీద ఈ అయిదేళ్ళ పథకం కాలంలోనూ, 6 వేల పెద్ద కర్మాగారాలు తిరిగి ప్రతిష్ఠించ బడ్డాయి.

## ఇవాళ - రేపు

1955 లో సోవియట్ ప్రజలు మరో అయి




దేళ్ళ పథకం పూర్తి చేశారు. 1956 లో ఆరో అయిదేళ్ళ ప్రణాళిక ప్రారంభమైంది. అంతే కాదు 1956 సంవత్సరం మహత్తరమయిన అక్టోబర్ విప్లవం నలభయ్యో వార్షికోత్సవానికి ముందటి సంవత్సరంకూడా.

1956 లో యంత్ర నిర్మాణ పరిశ్రమా, లోహ పరిశ్రమలూ — వీటిల్లో ఉత్పత్తి 1913 ఉత్పత్తికి 18 రెట్లయింది. అంటే, వెనక జార్ కాలంలో, ఏడాదికాలంలో ఉత్పత్తి అయిన యంత్రాలనూ, యంత్ర సాధనాలనూ, ఇప్పుడు సోవియట్ పరిశ్రమ రెండురోజుల్లో తయారు చేస్తున్నదన్నమాట. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి 1913 లో 190 కోట్ల యూనిట్లు వుండేది. 1956 లో 19200 కోట్ల యూనిట్లకు పెరిగింది. అంటే నూరు రెట్లయిందన్నమాట. భారీ పరిశ్రమలు సత్వరాభివృద్ధి పొందటమే కాక, వాడక, వస్తుపరిశ్రమకూడా 1913 కన్నా, 1956 నాటికి 12 రెట్లు పెరిగింది.

ఇంక, పరిశ్రమలకు సంబంధించిన యంత్ర విజ్ఞానంలో సోవియట్ యూనియన్ సాధించిన విజయాలు ఎంత గొప్పవి? ఒక్క 1956 లోనే 1056 కొత్తరకాల పనిముట్లూ, యంత్రాలూ సోవియట్ ఆర్థిక వ్యవస్థలో ప్రవేశపెట్టారు.

విప్లవానికి ముందు, రష్యాలో, బొగ్గు త్రవ్వకం యావత్తూ, ఒళ్ళు విరుచుకునే కాయకష్టంమీద ఆధారపడి వుండేది. 1957 నాటికి మొత్తం సోవియట్ యూనియన్‌లో బొగ్గు త్రవ్వకం, పగలకొట్టటం ఈ రెండుపన్లూ 99 వంతులు యంత్రాలతోనే జరుగుతున్నాయి. గనుల్లో బొగ్గురవాణా దాదాపుగా నూటికి నూరు వంతులూ, బొగ్గూ, రాయీ పైకి తేవటం, రైలు వాగన్లకు ఎక్కించటం నూటికి 99.9 వంతులూ యంత్రాలతోనే జరుగుతున్నాయి. ఇట్లా ఉదాహరణలు ఎన్నో వున్నాయి.

మొత్తం పారిశ్రామిక ఉత్పత్తిలో సోవియట్ యూనియన్ ప్రపంచంలో రెండో స్థానం ఆక్రమిస్తున్నది, అది ఇవాల్టి పరిస్థితి.

ఇంక రేపటికి — దాదాపు 32 వేల కోట్ల యూనిట్ల విద్యుచ్ఛక్తి, 1300 కోట్ల టన్నుల నూనె, అరువేల కోట్ల టన్నుల బొగ్గూ, 1960 నాటికి ఉత్పత్తి చేసేందుకు పథకాలు వేశారు.

రేపు అనేది మాకు ఈవిధంగా వుంటుంది. ఈ విషయంలో మాకు పూర్తి నమ్మకం వుంది.



ఆరవ ప్రపంచ యువజనోత్సవపు మెక్సికన్ ప్రతినిధివర్గ సభ్యుడు, జువాన్ కసదోస్.







# ప్రపంచ యువ





ఉత్సవంలో డైనమో స్టేడియంకు పోతున్న సిరియన్ ప్రతినిధి వర్గం (పైన)



ప్రపంచ యువజనులూ, విద్యార్థులూ మాస్కోలో జరిపిన ఆరో మహోత్సవం, యుద్ధానంతర కాలంలో అత్యంత మహత్తరమయిన ప్రాముఖ్యం గల ఒక సంఘటనగా రూపొందింది. ప్రపంచ యువజనులు యింత ఎక్కువమంది ఎన్నడూ సమావేశం కాలేదు. వారి మధ్య వెల్లి విరిసినంత అమితమయిన ప్రేమాభిమానాలూ స్నేహం ఇంతకు ముందెన్నడూ కనిపించలేదు. సోవియట్ యూనియన్ అమెరికా దేశాల యువజన ప్రతినిధివర్గాల కలయిక, చైనా, అమెరికాల యువజనుల సమావేశం, ఒక ప్రత్యేక విశిష్టతకలిగి మరింత ఆహ్లాదకర మయ్యాయి. ప్రపంచశాంతి నిలబెట్టాలన్న యువజనుల దీక్ష, ఆగస్టు 6వ తేదీని, హిరోషిమా పై అటంబాంబు పడిన వార్షిక దిన సందర్భంలో బ్రహ్మాండంగా ప్రదర్శితమైంది. ఆ రోజున 91 దేశాల ప్రతినిధులు, మాస్కో దగ్గర మానెజ్నాయా ప్లోష్చాద్ అనే చోట సమావేశమై, అణ్వాయుధ పరీక్షలు అంతం కావాలన్నారు; శాంతి చిరస్థాయి కావాలన్నారు.

ఈ ప్రపంచ యువజన మహాసభ, వివిధదేశాల కళా సంస్కృతులూ ఒకేసారి ఒక్కచోట చూపబడిన ఉత్సవాలలో అన్నింటి కన్నా గొప్పదిగాకూడా పరిగణించబడుతుంది.

నిత్యానికి జీవితానికి సంబంధించిన ఏ అంశమూ కూడా యీ మహోత్సవంలో విస్మరింపబడలేదు. క్రీడలూ, చిత్రలేఖనం పోటీ వంటివి ఎన్నెన్నో కార్యక్రమాలు జరిగాయి. వివిధ దేశాల ప్రతినిధులూ వీటిలో ఎంతో శ్రద్ధాసక్తులు కనపరిచారు. ఈ నాడు

అరవ ప్రపంచ యువజనోత్సవంలో పాల్గొన్న బాకూ, "లేబర్ రిజర్వ్స్" స







# యువజనోత్సవం

హెచ్. డి. మాలవీయ

ప్రపంచ యువజనులలో ఒక గొప్ప సాంస్కృతిక పునరుజ్జీవనం కలుగుతున్న దనటానికి యిది నిదర్శనం.

వ్యవసాయం, వేదాంతం, ఆర్థిక శాస్త్రం మొదలైన వివిధవిషయాలమీద యువజనులూ, విద్యార్థులూ పాల్గొన్న విద్వద్గోష్ఠిసభలు ప్రత్యేక ప్రాముఖ్యం గలవి. ఆర్థిక విషయాలపై విద్వద్గోష్ఠి గొప్పగా జయప్రదమయింది. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ భావి స్వరూపం గురించి. వివిధదేశాల యువజనులూ బాగా గ్రహించి మెలకువగా వున్నారని యిందులోవెల్లడయింది. ఆర్థికవిషయాల విద్వద్గోష్ఠిలో, అభివృద్ధిలో వెనుకబడివున్న ప్రాంతాల అభివృద్ధి సమస్యకి అగ్రస్థానమిచ్చి ఆలోచించటం గమనించవలసిన ముఖ్యమైన విషయం. అభివృద్ధిలో వెనుకబడివున్న ప్రాంతాలకి, మొట్టమొదట శాంతి అవసరమని, దాదాపు ప్రతి ఒక్కరూ ఒప్పు



...చెందిన నృత్య బృందం, "గొల్ల నృత్యాన్ని" ప్రదర్శిస్తోన్న దృశ్యం.
ఛాయాచిత్రకారుడు: ఎ. మురజోవ్.







లెనిన్ స్టేడియందగ్గర. మహోత్సవ ప్రదర్శనలో భారతీయ ప్రతినిధివర్గం

కున్నారు. అంతేకాక, బాగ్దాద్ ఒడంబడిక, ఆగ్నేయ ఆసియా ఒడంబడిక, ఇటువంటి సైనిక ఒడంబడికలు రద్దు కావాలన్నారు; అభివృద్ధిలో వెనుకబడివున్న ప్రాంతాల ఆంతరంగికవ్యవహారాలలో పరరాజ్యమేదీ జోక్యం కలిగించుకో రాదన్నారు. అభివృద్ధిలో వెనుకబడివున్నప్రాంతాల అభివృద్ధి ఏ పంథాలో జరగాలన్న విషయమై యువజనులు దాదాపు ఏకగ్రీవమయిన అభిప్రాయం వ్యక్తపరిచారు. ఇది సోషలిస్టు పద్ధతిలో మాత్రమే జరగగలదన్నారు; సామాజిక ఉత్పత్తివల్ల వచ్చిన లాభాలను ఎవరో కొద్ది మంది హక్కు భుక్తం చేసుకునే పెట్టుబడిదారీ పద్ధతులపై నడవటంలో వున్న ప్రమాదం యీ ప్రాంతాలకిపనికి రాదన్నారు.

(మిగత 40వ పుట చూడుడు)



# కళా ప్రదర్శనలు

ఎ. స్వొబొదిన్

ఆరవ ప్రపంచ యువజన విద్యార్థి మహోత్సవ సందర్భంలో జరిగిన అంతర్జాతీయ కళా ప్రదర్శనం, గోర్కీ కేంద్ర వినోదోద్యాన వన మందిరాలలో జరిగింది. ఇది ఒక విశిష్టమైన విశ్వ కళా ఖండాల గ్రంథం. ఇది చూసినవారికి, ప్రపంచమంతటా లలిత కళలలో అన్ని పోకడలూ తెలుసుకుని, ఎవరి నిర్ణయాలు వారు చేసుకోవచ్చు.

ప్రతీ జాతీయ విభాగంలోనూ, కొన్ని అద్భుతమయిన చిత్రాలున్నాయి. ఉదాహరణకి: ఫ్రెంచి విభాగంలో, ఫౌగెరాన్ అనే చిత్రకారుడు రచించిన బొమ్మ ఒకటుంది. దీనిపేరు "పారిస్‌లో అల్జీరియన్లు". ఒక పెద్ద నగరంలో ఏదో మారుమూల ఎక్కడో చెంకభాగంలో రాత్రింబగళ్ళు నకనకలాడిన దుస్థితిలో వున్నారిది, ఈ బొమ్మలో, పరిణతి పొందిన పాటవంతో అద్భుతంగా చిత్రించారు. ఇంక విభాగంలో ఒక యువక కళాకారుడు డెన్నీ విపులసాటి నీటి రంగులతో వేసిన అనేక బొమ్మలు, ప్రదర్శనం సందర్శించిన వారందరి దృష్టినీ ఆకర్షించాయి. "వేట". "ప్రేమికులు", "కుటుంబం" యీ చిత్రాలు ప్రత్యేకంగా చూడదగినవి.

వివిధ దేశాల విభాగాలలోనూ, అస్పష్టమైన ఊహా భావంగల చిత్రకళ కొంతవరకు ప్రదర్శించారు. జపానువారు ప్రదర్శించినవి దాదాపు అన్నీ యిటువంటివే. మెక్సికో విభాగంలో యిటువంటి చిత్రాలు అసలు లేనేలేవు. సోవియట్ యూనియన్ విభాగంలోకూడా యివి లేవు. సోవియట్ యువ చిత్రకారులు, వారి కళను ప్రజలకోసం అంకితం చేస్తున్నారు; సోషలిస్టు ప్రపంచంలో ఒక వినూత్న వ్యక్తిని రూపొందించే సాధనంగా వారికళను వినియోగిస్తున్నారు. సోవియట్ విభాగంలో ఆంద్రీ త్యుతునోవ్ రచించిన అద్భుతమైన ప్రకృతి దృశ్యాలు కొన్ని వున్నాయి. "ఒక గ్రామ గ్రంథాలయంలో" అనే శీర్షికతో ఐరినా షెవన్‌ద్రోవ్స్కా రచించిన ప్రఖ్యాత చిత్రంకూడా వుంది. పిల్లలంటే ప్రేమ, వారి భవిష్యత్తు ఉజ్వలంగా వుండాలన్న ఆకాంక్ష, యిందులో ప్రకాశిస్తున్నాయి.

ఇంకా చెప్పదగిన వర్ణ చిత్రాలూ, రేఖా చిత్రాలూ అనేకం వున్నాయి. వాటి గురించి చెప్పకుండా వుండటం కష్టం. అయితే యింత బ్రహ్మాండమైన ప్రదర్శనం గురించి యింకా వివరంగా సమీక్షించాలన్న కోరిక ఎంత వున్నప్పటికీ, యిటువంటి చిన్న వ్యాసంలో అంతా రాయాలంటే సాధ్యంకాదు.









ప్రదర్శనాలయంలోని ఒక విభాగాన్ని సందర్శిస్తోన్న సుఖానీ, భారతీయ ప్రతినిధులు.

ఛాయాచిత్రం: వి. తెర్-ఒవనెసోవ్




కొద్ది రోజుల క్రితం యువజన మహోత్సవం ప్రారంభమైన రోజులాగనే యీ వేళ మళ్ళీ మాస్కో నగరవాసులు ఎన్నో వేలమంది, శోభస్కరంగా వుండే సర్కస్ పెరేడ్ చూడటానికి మాస్కో నగరంలో దివ్యమయిన రింగ్ వీధి రోడ పక్క గుమిగూడేరు.



ఈ వీధి, రాజధానిలో ప్రధానమయిన దార్లలో ఒకటి. సర్కస్ పెరేడ్, గోర్కీ కేంద్ర వినోదోద్యానవనం నుంచి, వీధివెంబడి వస్తోంది. ముందు ఒక కారు వచ్చి సర్కస్ ఊరేగింపు వస్తోందని ప్రకటించింది. దానివెనుక, అలంకరించిన మోటారులో వాద్యబృందం వచ్చింది. అశ్వాకృతిలో చిత్రవిచిత్రంగా సైకిలు తొక్కేవారూ, పాదాల క్రింద యినుపచక్రాల చెప్పులు తొడుక్కొని రకరకాల రీతుల్లో తిరిగే రూ కష్టమయిన విన్యాసాలు చేశారు. వారివెనుక సర్కస్ కళాకారులతో కొత్త కార్లు వచ్చాయి. ప్రతీకారూ అందంగా అలంకరించారు.

ఈ సంచార శకటవాహినిలో వున్నవారు, వైవిధ్యంగల సంగీత కార్యక్రమం ప్రదర్శించారు. లారీలలో ఒకదాంట్లో వున్న రెండు బృందాల యువతులు, రింగులతోనూ, బంతులతోనూ విద్య చూపించారు. వీధికి అటూయిటూ వున్న జన సమూహాలు వారి నైపుణ్యానికి హర్షధ్వానాలు చేశారు. సర్కస్ ఊరేగింపు యీ చివరినుంచి ఆ చివరికి, ఎన్నో కిలోమీటర్లుంది. బ్రహ్మాండమయిన సర్కస్, మాస్కో మహాప్రాంతంలో నడి



గోర్కీ వీధిలోని, సర్కస్ ప్రదర్శనోత్సవంలో ల్యుద్మిలా కొతోవా





ఈ యువ గౌతమేలావాసి "శాంతి, స్నేహం," అన్న నినాదమిస్తున్నాడు

ఛాయాచిత్రకారుడు: ఎం. ముగ్రోవ్

బొడ్డున గుడారాలు వేసుకుందా? అన్నట్లుంది.

హాస్యగాళ్ళు వున్న లారీ రాగానే జనం సంతోషాతిరేకం కనపరిచారు. రష్యన్ సమాఖ్యలో శ్రేష్ఠమయిన కళాకారుడై, అంతర్జాతీయ సర్కస్ పోటీలో విజయం పొందిన ఓలెగ్ పొపోవ్, — తలమీద పెద్ద గళ్ళటోపీ, చొక్కా, మెడకి విలాస పురుషులు కట్టుకునే పెద్ద టై-సంప్రదాయ సిద్ధమయిన యీ దుస్తులు ధరించి, డ్రైవరు పక్కను కూర్చున్నాడు. మామూలుగా చమత్కారంతో ప్రేక్షకులను నవ్వించి ఆనందపరిచాడు.



# దర్శనట





నెస్తెరోవ్, తాష్కెంటేవ్ వ్యాయామ విద్యావిన్యాసాలనూ, ఓస్కల్-వోల్ కంపెనీనీ, జనం చాలా మెచ్చుకున్నారు. ఒక లారీ మీద రెండు అంతస్తుల రంకులరాట్నంవుంది. రెసెజెల్స్కాయాచేత శిక్షణ యివ్వబడిన కుక్కపిల్లలు దానిమీద చిత్రంగా తిరుగుతున్నాయి.

చెర్నికోవా, కరచురినా, రతోజినా, మొదలగు కళాకారులు, రకరకాల వ్యాయామవిన్యాస నైపుణ్యం ప్రదర్శించారు.

క్రూర జంతువులను మచ్చిక చేసిన నజరోవా పెద్దపులులలో ఒకదానితోపాటు బోనులోకి రాగానే, జనసమూహం హర్షధ్వానాలు మిన్నుముట్టేయి.

డైనమో స్టేడియంవరకూ యీ ప్రదర్శనలు యిలా సాగుతూనే వున్నాయి. మాస్కో నగరవాసులు, వ్యాయామ విన్యాస ప్రవీణుల నైపుణ్యాన్ని మెచ్చుకున్నారు. సర్కస్ సంగీతకారులను అభినందించారు. బూడిద రంగులో భయంకరంగా వున్న పెద్ద ఎలుగుబంట్లను రెండింటిని మచ్చికచేసిన వ్యక్తిని కొనియాడేరు. వాటిని మచ్చిక చేసిన వ్యక్తికి సహాయకారుడు, మధ్య మధ్య వాటికి సీసాలు అందించగానే, అవి దప్పికతో నీరు త్రాగుతూ వుండేవి.

మాయాకోవ్‌స్కీ స్క్వేర్ దగ్గర, ఒసీవియన్ తుర్కమెన్ రౌతులూ, జంతు ప్రదర్శన శాల సర్కస్ నటుల బృందం, ఊరేగింపులో చేరేరు. గుర్రాలు తారురోడ్డుమీద గిట్టలతో టకటకమని లయగా కొడుతూ అద్భుతంగా నృత్యం చేశాయి.

వ్లాదిమిర్ దురోవ్ జంతు ప్రదర్శన కేంద్రములో మచ్చిక చెయ్యబడినజంతువుల ఊరేగింపు చక్కగా వుంది.

అలంకరించబడిన ఒంటె ఒకటి, పెద్ద పూలబుట్టను మోసుకువెడుతూ, డైనమో స్టేడియందగ్గర ఊరేగింపులో కలిసింది.

భారతదేశపు ఏనుగు 'పంచి', ఊరేగింపుకి చివర మెల్లగా నడుస్తోంది. సర్కస్‌పెరేడ్, నిజంగా చాలా వైభవంగా సరదాగా జరిగింది.



గోర్కీ వీధిలోని సర్కస్ ప్రదర్శనలోని పోలిష్ సర్కసు.

# వనితా మహోత్సవం



ఎలీనా కొనొనెన్కో

గోధుమ వర్ణం శిరోజాలూ, నల్లని కురులూ గల అమ్మాయిలు, నృత్యశాల గౌనులూ, జాతీయ దుస్తులూ ధరించి, ప్రపంచంలో అన్ని ప్రాంతాలనుంచీ వచ్చి వన్నెచిన్నెలతో శోభిస్తూ, పార్కు దగ్గరకు చేరటం నిజంగా అద్భుతమయిన దృశ్యం. వారి కళ్లు ప్రకాశిస్తున్నాయి; ప్రతీ అమ్మాయి మందహాసం చేస్తోంది. వారిలో ఎవరు ఎక్కువ అందంగా వున్నారో నిజంగా నాకు తెలియదు. మెక్సికో, చైనా, ఫ్రాన్సు, ఉక్రెయిన్, నార్వే యిందులో ఏ దేశం అమ్మాయి ఎక్కువ అందంగా వుందో చెప్పలేను. మా మాస్కో కర్మాగారాలలోనూ, సంస్థలలోనూ, నిర్మాణ కార్యాలలోనూ పనిచేస్తున్న అమ్మాయిలు ఎక్కువ అందంగా వున్నారేమో తెలియదు. మా యువజనులు చేతిలో పూల గుత్తులు పట్టుకుని, పార్కు నాకి అటూ యిటూ బారులు తీర్చి నిలబడ్డారు. ఇక్కడ నిజంగా పూల పర్వతాలే వున్నాయి; ప్రతీ అమ్మాయీ ప్రెత్యేక అందమయిన పుష్ప గుచ్ఛం అందుకుంది. "నన్ను మరువకు" అనే పేరుగల చిన్న నీలిపువ్వులు, బుల్లి గాజు పాత్రలలో అమర్చబడి, వారి గౌనులకి గుచ్చబడి వున్నాయి. దేవలోకంనుంచి దిగిన రాణుల మోస్తరుగా వారికి అటూ యిటూ కొంతమంది చేరి, తెల్ల హంసలూ, నల్ల హంసలూ తిరుగుతున్న కోనేరుల దగ్గరకు వారిని తీసుకు వెళ్ళారు. ప్రతివారూ ఆనందంగా కాలం గడిపారు. గంగిరేణి చెట్ల పూల పరిమళం, ... గుబాళించింది. సువాసన ద్రవ్యాల పరిమళం, నారింజపండ్ల సువాసన, ఎక్కువగా వుంది. ప్రతీచోటు సంగీతంతోనూ, అమ్మాయిల నవ్వుతోనూ ప్రతిధ్వనించింది.

తూర్యనాదాల సరళ సంగీతం, పార్కు అంతటా వినిపించింది. నీలం, తెలుపు రంగులతో అలంకరించబడిన ఆరు పడవలు వచ్చాయి; ఒక్కొక్కదాంట్లో ముగ్గురు అమ్మాయిలు వున్నారు. వారి చేతులలో రంగురంగుల బెలూన్ల గుత్తులు వున్నాయి. పడవలు పెద్ద కోనేరు మధ్యకి రాగానే వారు ఆ బెలూన్లను పైకి వదిలిపెట్టేరు, అదే సమయంలో తెల్లని పావురాలు గుంపులు గుంపులుగా కోనేరుల మీదనుంచి ఎగురుతూ వెళ్ళాయి. నీలి దీపాల కాంతిమధ్య ఇదంతా జరుగుతూవుంటే, అది ఒక దేవలోక దృశ్యంగా అద్భుతంగా కనిపించింది. ఆ తరువాత పార్కు అంతటా నృత్యం, సంగీతం ప్రారంభ మయింది.

ప్రపంచ యువజన మహోత్సవంలో అమ్మాయిల ఆటవిడుపు యీ విధంగా ఆరంభ మయింది. వేలాది దీపాలు; వివిధ భాషలలో పాటలు పాడుతున్న వేలాది యువతుల గానం; సుడాన్‌నుంచి వచ్చిన నెల్లిగానీ, మెక్సికోనుంచి వచ్చిన గ్రేసి వెల్లాగానీ, నేలమీద కూర్చుని అడుగువేస్తూ చేసే రష్యన్ నృత్యం నేర్చుకున్న ఫ్రెంచి బాలికగానీ, దీనిని ఎన్నడూ మరచిపోరని నా నమ్మకం.

అయిదు ఖండాలనుంచీ వచ్చిన యీ యువతులకి, పాటలు పాడటం, నృత్యం చెయ్యటంతో పాటు, శాంతి కోసం, స్నేహం కోసం, వారి భవిష్యం కోసం ఎలా పోరాడాలో కూడా తెలుసు. బ్రహ్మాండమయిన యీ యువతుల సభ అధ్యక్షవర్గంలో ప్రపంచంలో అన్ని ప్రాంతాల ప్రతినిధులూ వున్నారు. దేశాల మధ్య శాంతి స్నేహాలు వర్ధిల్లాలన్న కాంక్ష గురించి వారంతా మాట్లాడేరు. శాంతి కావాలని గట్టిగా అడిగేరు; శాంతి సాధనకి పోరాడతామని శపథం చేశారు. ఈ భూమండల మంతటిమీదా వున్న బాలికలు, శాంతి సామరస్యాలతో జీవించాలనీ, చదువుకుని పని చెయ్యాలనీ, భావి కాలంలో భార్యలుగానూ, తల్లులుగానూ ఆనందంగా జీవించాలనీ కోరటం వల్లనే యిలా చేశారు.

కోవ్‌స్కీ పార్కులో ఉత్సవంలో ఇటాలియన్ ప్రతినిధి వర్గం. (ఛాయాచిత్రకారుడు: ఎం. మురజోవ్).







# కదంబం

"క్రాస్నవాలిటో, కార్నవాలిటో" నృత్యం చెయ్యాలని ఆకర్షణీయమయిన ఒక అమ్మాయి బిగ్గరగా కేకవేసింది. ఆమె దేశస్థుల బృందం. అక్కడ ఆపివున్న లారీల మధ్య చేరింది. గిటార్ తీగమీటారు; ఢంకాలు మ్రోగాయి; చప్పట్ల తాళంతో నృత్యం ప్రారంభమయింది.

నృత్యం ప్రారంభించిన అమ్మాయి పేరు గ్రేసియెల్లా ఓప్రిన్: బ్యూనసెయిరిస్‌లో వైద్య విద్యార్థిని; ఒక సాంస్కృతిక సంఘం ఆమెను మాస్కో మహోత్సవానికి పంపించింది. 165 మందివున్న ప్రతినిధివర్గంలో 25గురు విద్యార్థులలోనూ యీ అమ్మాయి ఒకరు. ఉత్సవం ఎలా వుంది? అని అడుగగా. "అద్భుతం" అని ఒక్కమాటలో గ్రేసియెల్లా సమాధానమిచ్చింది.

* * *

అమెరికన్ యువజన బృందం, వారి జాతీయ సంగీత కార్యక్రమం ప్రదర్శించింది.

వారిలో చాలామంది, మాస్కో రావటానికి ముందు ఎన్నడూ ఒక్కచోట కలియలేదు. అయినా పెగ్గీ సీగెర్, గై కారవాన్‌ల దర్శకత్వంక్రింద, వారంతా కలిసి సంగీత కార్యక్రమమొకటి తయారు చేశారు. కార్యక్రమం ముగింపు సందర్భంలో, వారు యీ ఉత్సవానికి ప్రత్యేకంగా రాసిన ఒక పాటపాడేరు. దీనిలో భావం యిది: "నీవు ధాన్యం పండించుకోవాలంటే, మొక్కవేసి పెంచాలి; ఉండటానికి యిల్లు కావాలంటే కట్టుకోవాలి; శాంతికావాలంటే, దాని కోసం నువ్వు పోరాడాలి. దీనికి మార్గం సర్వదేశాలూ స్నేహంపెంపొందించుకోవాలి." ఈ పాటను అంతా ప్రేమతో మెచ్చుకున్నారు.

ఉత్సవం ప్రారంభమయిన రోజున 27,000 పావురాలు ఎగురవేశారని మీరు బహుశా చదివేవుంటారు. అయితే నిజానికి అవి 27,000 కాదు; 27,001. పావురాల సంఖ్య యింత నిర్దుష్టంగా చెప్పటానికి దీనికి ఒక కథవుంది. మాస్కోకి వస్తున్న చైనా ప్రతినిధివర్గం రైలులో ప్రయాణంచేస్తూ, విశాలమయిన సైబీరియా మైదానాన్ని దాటుతోంది. ట్రాన్స్ బైకల్ ప్రాంతంలో ఎక్కడో ఒకచోట రైలు ఆగింది. చుట్టూ నీలిపర్వతాలు. పన్నెండేళ్ళ కుర్రాడు రైలువద్దరకివచ్చి పెకింగ్ సంగీత నాటకశాల గాయకులలో ఒకరయిన లీ చావ్ సియాంగ్ దగ్గరికి వెళ్ళాడు. ఆ బాలుని చేతిలో ఒక పంజరంవుంది; ఆ పంజరంలో ఒక పావురం. ఆ గాయకునికి ఏమిటేమిటో చెప్పడానికి ఆ అబ్బాయి సాధ్యమయినదంతా చేస్తున్నాడు. చివరికి పావురంతో ఆ పంజరాన్ని గాయకుని చేతికి అందించాడు. "నా పావురాన్ని మీతోపాటు మాస్కోకి తీసుకవెళ్ళండి. మహోత్సవం ప్రారంభసమయంలో, దానిని కూడా ఆకాశంలోకి ఎగురనివ్వండి!....."



"మీరు రష్యన్ భాషలో "ధన్యవాదాలని" ఎట్లా చెప్తారు" అని అడుగుతున్న యువనావికులు.

మరియా ప్లనోవా అనే విద్యార్థినికి ఒక భారతీయ ప్రతినిధి బ్యాడ్జిని పెడుతున్న దృశ్యం.



# తోటలో యంత్రాగారం

మాస్కోలో, బొగ్గునుంచి, మండే వాయువు తయారు చేసే కోక్‌గేస్ కర్మాగారం, మాస్కోకి రమారమి 30 కిలో మీటర్ల దూరంలో ఒక తోటలో వుంది. నగరవాసులకీ, పరిశ్రమలకీ, యీ కర్మాగారం గేస్ సప్లయిచేస్తుంది; వ్యవసాయానికి రసాయన పదార్థాలు — అంటే ఎరువులూ, విష రసాయనాలూ కూడా సప్లయి చేస్తుంది. అన్నింటికన్నా ఏ పరిశ్రమ మరీ అపరిశుభ్రంగా వుంటుందని మీరు ఏ ఇంజినీరునయినా అడగటం జరిగితే, 'కోక్ రసాయన పరిశ్రమ' అని ఆయన జవాబు చెప్పవచ్చు. నిజమే. ఎందుచేతనంటే మామూలు బొగ్గునుంచి వాయువులు తీసి కోక్ బొగ్గుగా మార్చినప్పుడూ, గేస్‌ని పరిశుద్ధం చేసినప్పుడూ, రసాయనాలు తయారు చేసినప్పుడూ, విషపూరితమయిన రసాయన పదార్థాలతో నిండిన గేసు, దుమ్ము పొగ, చాలా ఎక్కువగా గాలిలోకి వస్తుంది కాబట్టి, సర్వసాధారణంగా అలాగేవుంటుంది.



కోకింగ్ బ్యాటరీ, ఒక దృశ్యం

కాని, యీ కర్మాగారంలో మీకు దుమ్ము, అపరిశుభ్రమయిన పదార్థాలు కనిపించవు. ఎందువల్లనంటే కార్మికులు, దీనిని ఒక ఉద్యానవనంగా మార్చివేశారు. వారి తీరిక సమయంలో, కర్మాగారం ఆవరణలో 50,000 కి పైగా మొక్కలూ, చిట్టి పొదలూ నాటేరు. ఇప్పుడు యిందులో ప్రతీకార్ఖానాకీ దేనికి దానికి పూలతోట వుంది. జనం తిరిగే చిన్నచిన్న ఉద్యానవనాలూ, పచ్చిక బయళ్ళూ, పూల మొక్కలు వేసిన మళ్ళూ కూడా వున్నాయి.

రాసులుగా పోసిన బొగ్గునుంచి రేగే దుమ్మూ పొగ, గాలిలో కలిసి అపాయం కలిగించకుండా చెయ్యాలంటే, చెట్లు పెంచినంత మాత్రాన సరిపోదు. దీనికి పొగను పట్టుకుని లోపలికి లాక్కునే ప్రత్యేక పరికరాలు కావాలి; ఉత్పత్తి అధునాతనమయిన పద్ధతిలో జరగాలి. ఇటువంటి యంత్ర పరికరాలన్నీ యీ కర్మాగారంలో అమర్చారు. అందుచేత చెట్లు చచ్చిపోకుండా పచ్చగా వుండటం మాత్రమేకాక ఏయేటికాయేడు దట్టంగా గుబురుగా పెరుగుతున్నాయి.

కార్మికులు నివసించే పేటలో కూడా చెట్లు పచ్చగా కనిపిస్తాయి. ఇళ్ళవద్దనేకాక, పాఠశాలలూ, చిన్న పిల్లల ఉద్యానవన బోధనాసలాలూ, ఆసుపత్రీ, పిల్లలకి దుకాణాల చుట్టూ కూడా ఎక్కడ చూసినా పచ్చిక, చెట్లూ కనిపిస్తూ వుంటాయి.

కోక్‌బొగ్గు రసాయనాల కర్మాగారం దగ్గర యిదంతా చేశారు. అందుచేత కర్మాగారంలో ఉత్పత్తి, యిప్పుడు మనుషులకి గానీ వృక్షజాలానికిగానీ ఎంతమాత్రం హానికరం కాదు.

గంధకాన్ని పరిశుభ్రపరిచే ఆధ్రా విధానం.
రిజనరేటర్ యొక్క ఒక దృశ్యం →





# సామ్యవాద వాస్తవికత - సోవియట్ సాహిత్య సృజనాత్మక రీతి

◈ ఎల్. యకిమెన్కో ◈

*మాస్కో విశ్వవిద్యాలయం ప్రొఫెసర్, సోవియట్ దేశ రచయితల సంఘ సభ్యుడు*

ఈ సంచిక మొదలుకొని మా పత్రికలో సోవియట్ సాహిత్యాభివృద్ధిని గురించి ఒక వ్యాస పరంపరను ప్రకటిస్తున్నాము. దీనిని మాస్కో విశ్వవిద్యాలయం భాషా శాస్త్ర విభాగం అధిపతి లెవ్ యకిమెన్కో వ్రాశారు.



సోవియట్ సాహిత్య చరిత్రాధ్యాపకుడైన లెవ్ యకిమెన్కో షొలొకొవ్, తదితర సోవియట్ రచయితల రచనలపై అనేక వ్యాసాలను వ్రాశారు.

## సామ్యవాద వాస్తవికత మూలాధారాలు

సోవియట్ సాహిత్యాన్ని సామ్యవాద వాస్తవికతా సాహిత్యం అని అనవచ్చును.

సామ్యవాద వాస్తవికత, విప్లవానికి పూర్వం ఒక కొత్త వర్గం, శ్రామిక వర్గం, రష్యాలో చారిత్రకాభివృద్ధి రంగంలో ప్రవేశించి నప్పుడు ఉద్భవించింది. శ్రామికవర్గం యొక్క విప్లవాత్మక చర్య, ఒక నూతన కళ యొక్క పుట్టుకకు, నిర్దిష్టమైన ఒక ఆశాపూరిత కళ పుట్టుకకు, దారితీసింది. పంథొమ్మిదవ శతాబ్దపు విమర్శనాత్మక వాస్తవికత వంటిది కాదిది. ఇదే తర్వాత సామ్యవాద వాస్తవికతగా నిర్వచింప బడినది.

పంథొమ్మిది, ఇరవయ్యవ శతాబ్దాల సంధి కాలంలో యువకుడైన మాక్సిమ్ గోర్కీని ప్రపంచం గుర్తించింది. లెవ్ టాల్‌స్టాయ్, ఎఫ్. దాస్తొవిస్కీ, ఎ. చెకోవ్‌లలాంటి మహా రచయితల కోవకు చెందిన, శ్రామిక రచయిత లందరిలోకి గొప్పవాడైన గోర్కీ కళల చరిత్రలో అప్పుడే ఒక నూతన అధ్యాయాన్ని ప్రారంభించారు. మానవ సంస్కృతీ పరిణామంలో, సోవియట్ సాహిత్యంలో, ఆయన వహించిన పాత్రను ఒక నూతన ప్రపంచాన్ని కనుగొన్న వ్యక్తి యొక్క అద్భుత కృత్యాలతో పోల్చవచ్చును.

"అనాగరకులు" (ఫిలిస్టయిన్స్) అన్న ఆయన నాటకంలోనే (1901 లో వ్రాసింది) గోర్కీ ఒక అసాధారణమైన పాత్రను—నిల్ అనే ఒక శ్రామికుని—నాటక రంగం మీదికి తీసుకువచ్చాడు. ఈ పాత్ర ప్రజల దృష్టిని వెంటనే ఆకర్షించింది. పొగచూరిన ముఖం, నూనెపట్టిన గుడ్డలతో కార్మికుడు అతని వాస్తవ రూపంలో ప్రేక్షకులకు పరిచయం చేయబడ్డాడు.

నిల్ కేవలం మన ఆసక్తిని చూరగొనే పాత్ర మాత్రమే కాదు. "అనాగరకులు" అన్న నాటకంలోని అన్ని పాత్రలకంటే గట్టి చిత్తస్థైర్యం కలవాడు, వివేకవంతుడు, కరుణా స్వభావుడు. "హక్కులు ఇవ్వబడేవి కావు, సాధించుకొనబడాలి" అన్న వాస్తవ విషయాన్ని వ్యక్తంచేసే ఒక మహత్తర శక్తి నిల్ ద్వారా ద్యోతకమవుతుంది. మానవుడు జీవితాన్ని మార్చగలడనీ, దానిని రమణీయంగా చేసుకొనగలడనీ నిల్ నమ్ముతాడు.

ప్రజల స్వాతంత్ర్యం కొరకు, మానవుని విముక్తి కొరకు పోరాడగల శ్రామికుని ప్రప్రథమంగా గోర్కీ సాహిత్యంలోకి ప్రవేశ పెట్టాడు. "అమ్మ" (1907) అన్న నవలలో గోర్కీ మరి రెండు శ్రామికవర్గ నాయక పాత్రలను ప్రవేశపెట్టారు. ఆ పాత్రలు పావెల్ వ్లాసోవ్, అతని తల్లి నిలొవ్నా. నిరక్షరాస్యురాలై అణగద్రొక్కబడి ఉండిన నిలోవ్నా తన కుమారునికి అతని విప్లవ కార్యకలాపాలలో సహాయపడడం నేర్చుకొంటుంది. "శత్రువులు" అన్న ఆయన నాటకంలో సిన్త్సోవ్ అనే ఒక బొల్షివిక్ నాయకత్వంలో ఒక కార్మికుల జట్టు మనకు అగుపడుతుంది.

"చైతన్యత, లేదా వేరే విధంగా చెప్పాలంటే, కార్మిక వర్గంతో నా ఆత్మీయత నాకు నా యౌవనవశలోనే అవగతమైంది," అని గోర్కీ 1927 ఆయన వ్రాసిన ఒకానొక లేఖలో వ్రాశారు.

సాంఘిక పీడనకు వ్యతిరేకంగా ప్రజలు కొనసాగించే మొత్తం ఉద్యమానికి నాయకత్వాన్ని వహించిన రష్యన్ కార్మికవర్గ పోరాటం, గోర్కీ రచనలకు ప్రామాణికమైన పునాది. తర్వాత తర్వాతసామ్యవాద వాస్తవికతగా పేరుపడసిన ఒక నూతనమైన కళ యీ విధంగా ఉద్భవించింది.

## సంప్రదాయాలు : నవీన కల్పనలు

సోవియట్ కళలు ఏనాడూ 19 వ శతాబ్దపు రష్యన్ వాస్తవికత యొక్క మహత్తరము, మహోన్నతము అయిన సంప్రదాయాలను విసర్జించలేదు. ఈ నాటికిగూడా అది ప్రపంచ కళాసంపదలోని ఉత్తమమైన విషయాల నన్నింటిని ఎంతో కృతజ్ఞతతో స్వీకరించి, వాటిని జీర్ణించుకొని సత్ఫలితాలను సాధించుకొంటున్నది. సామ్యవాద వాస్తవికత, జీవితం, ప్రజల వాంఛ, మానవతలకు సన్నిహితమైన సంప్రదాయాలను పరిపోషించుకొంటూ, వాటిని మరింత సుసంపన్నం చేసుకొంటుంది.

ఈ శతాబ్ది మూడవ దశకంలో ఉత్పన్నమయిన సోవియట్ సాహిత్యంలోని ఉత్తమ రచనలలో, గోర్కీ, షొలొకోవ్, అలెగ్జీ టాల్‌స్టాయ్, మాయకోవిస్కీల గ్రంథాలలో, అప్పుడప్పుడే రూపొందుతున్న ప్రాచీన రష్యన్ సాహిత్యం, వినూత్న రష్యన్ సాహిత్యాల మేలు కలయిక ద్యోతకమవుతుంది.

కాని సంప్రదాయాల పరిపోషణ అంటే, పాతవాటినే పునరుల్లేఖించడం కాదు. సోవియట్ సాహిత్యం నిర్దిష్టమైన ఒక వినూత్న కళగా ఉద్భవించి, పెంపొందినది.

వెయ్యి సంవత్సరాల కాలంలో ప్రథమ పర్యాయంగా ప్రజలు తమ జీవితాన్ని తమ ప్రయోజనాల కనుగుణ్యంగా తీర్చి దిద్దుకొంటున్నారన్న విషయమే, ఈ చారిత్రక పరిణామం యొక్క అసాధారణ స్వభావమే, సోవియట్ రచయితలు నూతన మార్గాలను అన్వేషించడానికి దారితీసింది. సాహిత్యం వారికి తమ మనోగతాభిప్రాయాన్ని,

ప్రపంచంపట్ల తమ వైఖరిని ప్రకటించే సాధనమేగాక, నూతన జీవితం కొరకు పోరాటం సల్పుతున్న తమ ప్రజలకు సేవజేసే సాధన కూడా అయింది.

విప్లవానంతరం గడిచిన పది సంవత్సరాలలో, ప్రపంచపు మహోన్నత విప్లవ శకాన్ని ప్రతి బింబించే రచనలు గావించిన ప్రతిభావంతులైన గ్రంధకర్తలు తేజోవంతమైన తారలవలె వెలిశారు. సెరాఫిమోవిచ్ వ్రాసిన "లోహవాహిని", ఫుర్‌మనోవ్ వ్రాసిన "చాపయేవ్", ఫెదయేవ్ వ్రాసిన "పంధొమ్మిది మంది", షొలొకోవ్ వ్రాసిన "ప్రశాంతవాహిని, డాన్" యొక్క ప్రధమ భాగం యీ కాలంలోనే ప్రచురితమయ్యాయి. ఈ సాహిత్యం సత్యం అనే పునాదిపైన నిర్మింపబడింది.

"మేను పులకరించే విషాదకరనవల" అన్నారు టాయ్‌జ డి వ్రయిస్ అనే ఒక రచయిత, "ప్రశాంత వాహిని, డాన్" అన్న షొలొకోవ్ నవలను గురించి. "డాన్ నదీ ప్రాంతంలో జరుగుతున్న తీవ్ర వర్గపోరాటాన్ని ఊపిరి బిగబట్టి చదువుతాం మనము. హోమర్ మహాకావ్యం స్థాయిలోవున్న ఒక మహా కావ్యంగా యీ నవలను పరిగణింపవచ్చును. ఏవిషయాన్ని గురించయినా ధైర్యంగా చెప్పగలగడం, అనుకోనివి, అవాంఛితమైనవి అయిన విషయాల నుండి పారిపోకుండా ఉండడము, సంగతులను ఉన్నవి ఉన్నట్లుగా తెలుపడము, జీవితం యొక్క అంతరంగిక ఘర్షణలను చిత్రించడము — ఈ విషయాలే మిఖైల్ షొలొకోవ్‌లోని అంతటి మానవత్వానికి, గొప్పదనానికి కారణభూతమై, అప్పటికి నేను చెందియున్న యువక బూర్జువా రచయితల వర్గాన్నికూడా ఆకర్షించాయి.

రచయిత యొక్క ప్రయోజనాత్మకదృష్టి, కమ్యూనిస్టు ఆదర్శాల విజయంపట్ల అతని తీవ్రాసక్తి సామ్యవాద వాస్తవికతకు మూలాధారా లయ్యాయి.

## మానవుడు : ప్రజలు

ఒక నూతన ప్రపంచం కనుగొనబడడంతో ఒక వినూత్నమైన కళ, ఒక క్రొత్త నాయకుడు పుట్టుకురావడం జరుగుతుందని ప్రపంచ సాంస్కృతిక చరిత్ర తెలియజేస్తుంది.

సామ్యవాద వాస్తవికతకు పునాదివేసిన మాక్సిమ్ గోర్కీ రచనలలోని అసాధారణపు నాయకుడైన యీ క్రొత్త వ్యక్తి అతి సామాన్యుడైన కార్మికుడు. లక్షలాది ప్రజల ప్రయోజనాలకు సాహసంతో పోరాడే యీ నాయకుడు ప్రజల మధ్యనుంచి ఉద్భవించినవాడే.

అంతర్యుద్ధపు ప్రఖ్యాత నాయకుడు చపయేవ్ విషయమే తీసుకొందాము. అంతర్యుద్ధానికి పూర్వం ఇతడు పేద రైతు. ఇతనిని గురించే డి. ఫుర్మనోవ్ "చపయేవ్" అన్న తన నవలలో చిత్రించాడు. అంతర్యుద్ధ కాలంలో తీవ్రమైన రణరంగాల్లో గొప్ప సాహసంతో పోరాడిన యువక కార్మికుడైన పావెల్ కొర్చగిన్ గాయాల ఫలితంగా అంధుడైపోయి మంచం పట్టినా అతని మనోనిబ్బరం మాత్రం యెన్నటికీ చెడదు. ("కాకలు తీరిన యోధుడు" అన్న ఎన్. ఒస్త్రోవిస్కీ నవల); "యువక యోధుడు" అన్న ఎ. ఫెదియేవ్ నవలలో సాహసవంతులైన యువకవీరులు హిట్లర్ మూకల చిత్రవధలకు చిరునవ్వుతో గురియౌతారు. పైలెట్ మెరిస్యేవ్ (బి. పొలివాయ్ నవల "నిజమైన మానవునికథ") యుద్ధంలో కాళ్ళు పోయినా గూడా లెక్క చేయకుండా కృత్రిమపు కాళ్ళపైన నడవడం నేర్చుకొని, శత్రువుతో పోరాడడానికి యుద్ధ విమానంలో ప్రత్యక్ష మవుతాడు. ఈ కథా నాయకులలో ఎవరిని తీసుకొన్నా సరే, వారు వివిధ తరాలకు చెందినవారు, వివిధ రకాల జీవితాలు, స్వభావాలు కలవారు అయినప్పటికి, వారందరిలో ఒక సమాన గుణం కనబడుతుంది.

వారంతా ప్రజల మధ్యనుంచి వచ్చినవారే. ప్రజలకొరకు తమ శక్తి సంతతిని, జీవిత సర్వస్వాన్ని ధార పోస్తారు.

మానవుడికీ, ప్రజలకూ మధ్య వుండే విడదీయరాని సంబంధాలను సామ్యవాదకళ అవశ్య నైతిక విలువగాను, మానవుని ధర్మంగాను పరిగణిస్తుంది.

సామ్యవాద వాస్తవికతా రీతియొక్క అత్యంత ప్రధాన సూత్రానికి మూలాధారం యిదే. అది యీ క్రిందివిధంగా సూత్రీకరింపబడవచ్చును : సామ్యవాద వాస్తవికతా రచనలలో కథా నాయకుని జీవితము ప్రజల జీవితం, పోరాటాలతో, వాటి ఆదర్శాలు, ఆశలతో మేళవింపబడి చిత్రింపబడి, తదనుగుణంగా అతని స్వభావం రూపొందించబడుతుంది. ఉత్తమ జీవితం కొరకు ప్రజలు జరిపే పోరాటమే ముఖ్యాంశ మవుతుంది. దానినే గీటురాయిగా పెట్టుకొని రచయిత వివిధ రకాలవారిని, వివిధ స్వభావాలవారిని, వారి నిజరూపంలో చిత్రిస్తాడు.

గోర్కీ తరుచు ప్రస్తావిస్తూ వచ్చిన ఈ "మహోన్నత పరిశీలనా స్థాపరం", భవిష్యత్ దృష్టితో ఆయా కాలాల జీవితాన్ని అవగతం చేసుకొని, నిర్ణయించే యీ ఆసక్తే, సామ్యవాద వాస్తవికత యొక్క ఒక అతి ముఖ్యాంశము.

రచయిత ఆశించేది గతంలోంచి ఉద్భవిస్తున్న ప్రస్తుతాన్ని అర్థం చేసుకోవడం మాత్రమేకాదు, ప్రస్తుతంలోంచి భవిష్యత్తు ఉద్భవించడాన్ని కూడా చూడాలని ఆశిస్తాడతడు. సోవియట్ సాహిత్యం యొక్క చారిత్రక ఆశావాదానికి మూలాధారం అదే.

## ఐక్యత: వైవిధ్యం

శ్రమిక ప్రజల జీవితమూ, నూతన ప్రపంచాన్ని రూపొందించడానికి వారు జరిపే కృషియే సామ్యవాద వాస్తవిక రచయితలకు ఉత్సాహాన్ని, శక్తిని చేకూర్చే మూలాధారాలవుతాయి.

విశిష్ట లక్షణాలు, సంప్రదాయాలు కల సోదర ప్రజల సమాన హోదాగల జాతీయ సాహిత్యాల సమ్మేళనంగా సోవియట్ సాహిత్యం పెంపొందుతున్నది. అనేక ఉత్తమ కావ్యాలను వ్రాసిన లిథూనియన్ రచయిత ఎ. ఉవిక్‌కా, "అబాయ్" అనే పేరుతో అద్భుతమైన జీవిత చరిత్రా నవలను వ్రాసిన కజఖ్ రచయిత ముక్తర్ ఔఎజోవ్‌కు మధ్య, కళాకారులుగా గమనార్హమైన వైవిధ్యం గోచరిస్తుంది. అంతేగాక ఇరువురూ తమతమ రచనలను జాతీయతతో నింపివేస్తారు.

ప్రజలకు సేవ చేయాలన్న కళయొక్క యేకాగ్రోద్దేశ్యమే వారిలో నున్న సమాన గుణం. సామ్యవాద వాస్తవికతా రీతికి పునాది యిదే.

"జీవితాన్ని, దాని విప్లవాత్మకాభివృద్ధిలో వాస్తవంగా చిత్రించాలని సామ్యవాద వాస్తవికత రచయితలను కోరుతుంది. అతని ప్రతిభ, పౌరవల విశిష్ట లక్షణాలను ప్రకటించుకోడానికి అతనికి సర్వావకాశాలను చేకూర్చుతుంది. వివిధములైన అనేక కళాత్మక మార్గాలు, రీతులు పెంపొందాలని ఆశిస్తూ, అన్ని రంగాలలోను నవ్యరీతులను ప్రోత్సహిస్తుంది," అని సోవియట్ దేశ రచయితల రెండవ మహా సభలో ఆమోదింపబడిన సోవియట్ దేశ రచయితల సంఘం నిబంధనావళిలో ఉన్నది.

రస రచనలలోని విశిష్ట చిత్రణ, నాటకీయతలతో పాఠకుని మైమరపించే మిఖైల్ షొలొకోవ్, రమణీయ శైలితో గంభీరతను,

(మిగత 37వ పుట చూడుడు)

# 'అబాయ్' జీవితం

## (ఎం. ఔఎజోవ్ నవలనుండి)

ముక్తర్ ఔఎజోవ్ పురాతనపు కజఖ్ రచయితలలో ఒకరు. ఆయన సాహిత్య వ్యాసంగం 1917లోనే ప్రారంభమైంది. మొదట మొదట రచించిన కథలు, వ్యాసాలు, నాటకాలు, ఇతిహాసాలు, "అరమతుల రోజులు," సర్వహక్కులను కోల్పోయిన, కజఖ్కుల, విప్లవానికి పూర్వపు దిక్కుమాలిన జీవితాన్ని చిత్రిస్తాయి. 1930'లో ఆయన ఎన్నో గ్రంథాలు రచించారు. వాటిలో "షక్తాలన్", "బాటలు," "భుజానికి భుజం," "మూడురోజులు" మొదలైన రచనలలో నూతన సోవియట్ వ్యక్తిని చిత్రించారు. అదే కాలంలో అంతర్యుద్ధానికి సంబంధించిన నాటకాలనుగూడా పరంపరగా రచించారు.

ఇరవై సంవత్సరాల క్రితం, 1937లో, ఔఎజోవ్, కజఖ్ జీవితాన్ని ప్రదీప్తం చేసిన కజఖ్ సాహిత్య నిర్మాత 'అబాయ్ కునన్బయేవ్'ను గురించిన ఒక మహత్తర నవలను ప్రారంభించారు.

ఔఎజోవ్ రచించిన 'అబాయ్' అనే ఈ వీరపురుషేతిహాసం ఒక ప్రసిద్ధ జాతీయ మహాకవి జీవితాన్ని మాత్రమే అభివర్ణించదు, ఒక విధంగా ఇది కజఖ్ ప్రజల గాథ, చరిత్రకూడా. దోపిడినుంచీ దారిద్ర్యంనుంచీ ప్రజలకు విముక్తి కల్పించాలని కలలుగన్న పుత్రములైన కజఖ్ ప్రజలు స్వప్నమించిందీ, ఆశించిందీ, న్యాయశీలురైన రష్యన్ ప్రజలు స్వప్నమించిందీ, ఆశించిందీ ఒక్కటే. "అబాయ్ పథం" అనే నవల లోని ఈ దిగువ భాగంలో కజఖ్కులకు, ప్రవాస శిక్షను అనుభవిస్తోన్న రష్యన్ విప్లవ కారుడు పావ్లోవ్ పట్ల, ఆనాటి రష్యాలోని అగ్రగామి ప్రజల పట్ల వున్న ప్రేమాదరాలను సువ్యక్తం చేస్తున్నది. పావ్లోవ్ వంటి రష్యన్లు, ఒక్క రష్యన్ ప్రజల సౌఖ్యం కొరకేగాదు కజఖ్ ప్రజల సంక్షేమం కొరకైకూడా పోరాడుతున్నారని, కజఖస్తాన్ స్వేచ్ఛ, రష్యా స్వేచ్ఛ అవిభాజ్యమైనవనీ వారు గుర్తించారు.

అబాయ్ డేరాలోకి అడుగు పెట్టేటప్పటికే అబిష్, త్వరత్వరగా ఉత్తరాలన్నింటినీ ఒక చూపుచూశాడు.

తండ్రి లోపలికి రావడంతోనే, "ఇదిగో ఇది, సెమిపలతిన్స్కీ ఉజెద్ అధికారి పంపిన ఉత్తరువు. అది, ఫెయొదోర్ ఇవనోవిచ్ దగ్గరనుంచి వచ్చిన జాబు,"...."నాకూ ఒక జాబు రాశా రాయన" అన్నాడు.

పావ్లోవ్ పేరు ఎత్తేటప్పటికే అబాయ్ ముఖవైఖరి మారి పోయింది. చిరునవ్వుతోన్న ఆయన వదనం కళకళ లాడింది. ఇంతలో ఉత్తరాలా మాటలు స్ఫురణకు రావడంతోనే, ఆ ఉత్తరువు నందుకోవడానికని చేతులు చాచాడు, ఛటుక్కున, ఇంటిదగ్గరే కళ్ళ జోడు మరచి వచ్చాననుకుని అబిష్‌నే ఆ ఉత్తరువులు ఏమిటో చదవ మన్నాడు.

ఇతరుల చెవిన పడకుండా వుండాలని అబిష్ తండ్రికి దగ్గరగా తనే వంగి నింపాదిగా గుసగుస లాడినట్టు అవి చదివి విని పించాడు.

గవర్నర్ కార్యాలయాదేశానుసారం ఉజెద్ అధికారి కజెన్ త్సెవ్, ఇబ్రహీమ్ (అబాయ్) కునన్బయేవ్‌ను, కరమోలిన్స్కీ సంత ప్రాంతంలో, సెప్టెంబరు 5న జరిగే సెమిపలతిన్స్కీ, ఉస్త్ కమెనొగోర్స్కీ, జైస్సన్స్కీ—ఉజెద్స్ ప్రతినిధుల అసాధారణ సమావేశం ముందు హాజరు కమ్మన్నాడు. ఆజ్ఞాపన, పైనచెప్పినట్టు అబాయ్ హాజరు కాని పక్షంలో, దానికి ఆయన బాధ్యత వహించ వలసి వుంటుందన్న హెచ్చరికతో ముగించ బడింది.

ఈ ఉత్తరువులు జారీ చేయబడడానికి కారణంకూడా పేర్కొనబడింది. చెంఘిస్ వోలోస్త్‌లో పన్నులు బకాయిపడ్డ వాళ్ళ మీది కేసులో ఈయన ప్రతివాదిగా పిలువబడ్డాడు. ఉజెద్ అధికారి కార్యాలయంలో ఈ కేసులో సాక్ష్యం చెప్పడానికిగాను, గడిచిన ఏడాది నుంచీ ఇట్లా అబాయ్ ఇప్పటికి మూడుసార్లు పిలిపించబడ్డాడు. చివరకు ఇది గవర్నర్ కార్యాలయ విచారణకు పంపబడ్డట్లు బయట పడ్డది. బహుశా అంతకన్నా ఉన్నతాధికారుల జోక్యంకూడా వుండొచ్చు. గడచిన విచారణ, ఆ ఏటి వసంత ఋతువులో జరిగినప్పుడు. ఒక అధికారి, ఈ కేసుకు సంబంధించిన కాయితాలను ఓమ్స్కీలోని గవర్నరు జనరల్ కార్యాలయం కోరుతున్నదని సూచ్యంగా చెప్పిన అంశంగూడా అతనికి గుర్తుకొచ్చింది.

సమన్ల తర్వాత అబిష్ పావ్లోవ్ జాబు చదవటం ప్రారంభించాడు. ఫెయొదోర్ వేసవికాలమంతా ఐర్‌త్యష్‌లో, ఆ ప్రాంతములో వలస లేర్పరచుకొన్న వారి జీవితాన్ని అధ్యయనం చెయ్య డంలో గడిపి, అప్పుడప్పుడే సెమిపలతిన్స్కీకు తిరిగి వచ్చాడట. గవర్నర్ కార్యాలయంలోని ఆయన స్నేహితుడొకడు, అబాయ్‌ని గురించి ఈ మధ్య ఎన్నో ఫిర్యాదులొస్తున్నట్టు చెప్పాడట.

"స్టెప్పీలలోని నీ శత్రువులు ఇద్దరూ, గవర్నర్ ఉద్యోగులూ ఒక అంగీకారానికి వచ్చినట్టు తోస్తున్నది. వీలయినంత నీదగ్గర నుంచి వాళ్ళు గుంజడానికి చూస్తున్నారు, వినాశకుణ్ణి శాంతి పరచ డానికి గాదు, న్యాయదేవతను ఉపశమింపజెయ్యను. ఏమిటీ శాంతి పరచడం అంటే లంచాలు పట్టడమన్నమాట," అని తన సహజ సరళ ధోరణిలో వ్రాస్తూ పావ్లోవ్, "నేను నీకిచ్చే సలహా ఏమి టంటే ఉన్నత ప్రభుత్వాధికార్లను సైతం ధైర్యంగా ఎదుర్కొన మని, వారిముందు తలఎత్తుక తిరగమని. ఎందుచేతనంటే అట్లా ప్రవర్తించటానికి నీకు హక్కు ఉంది. స్టెప్పీ ప్రజలలో నీకున్న పేరు ప్రతిష్టలు విశిష్టమైనవి; జైస్సన్ కజఖ్కులలోను, ఉస్త్‌కమెనొగోర్స్కీ ఉజెద్స్‌తోను సంభాషించినదానినిబట్టి ఆ విషయాన్ని నేను తెలుసుకొనగలిగాను. నిన్నుగురించి విన్నప్పుడు నేను ఎంతో సంతోషించాను, అది నువ్వంటే నాకో గర్వకారణమైంది. నీప్రజలు



సీతో ఉన్నారు. ఇంతకన్నా ఏమానవుడైనా తన జీవితంలో కోర దగిన ప్రతిఫలం మరొకటి ఉందా? బ్రతుకే ఒక పోరాటం........ నువ్వూ, నేనూ ఈ విషయాన్ని బాగా గ్రహించామనుకుంటా...."

పావ్‌లోవ్ లేఖను వింటున్నప్పుడు అనాయ్‌కి, తనను అది పంలో ఆపాదమస్తకం ఆవహించుకొన్న స్తబ్ధతను వివలించుకొంటు న్నట్టు ఒక అనుభూతి కలిగింది. తనను క్రుంగదీస్తున్న దుఃఖభారం వల్ల కలిగిన నిరాశ, నిస్పృహలలో దేనిగ్గాను బ్రతకడం? అని. తనను తానే ఒక్కొక్కమాటు ప్రశ్నించుకున్నాడు. ప్రజ్ఞా సముచిత మైన పావ్‌లోవ్ స్నేహ ప్రతిస్పందన అతనికి ఎంతో ధైర్యాన్నికలుగ జేసింది. అనాయ్ ఇదివరకే జీవితంలో ప్రతివిషయాన్ని శ్రద్ధాసక్తు లతో, లోతుగా ఆలోచించగలిగిన పావ్‌లోవ్ విచక్షణా సామర్థ్యానికి ఆకర్షితుడైనాడు. "వివేకం దుర్మార్గాన్ని ఎదిరించగలుగుతుంది.... దాన్నే ఆశ్రయించు, దానిమీదనే ఆధారపడినట్లయితే, నువ్వు నైచాన్ని, కోపాన్ని అధిగమించగలుగుతావు. అప్పుడే నీచమైన క్రోధాన్ని, కుటిలోపాయాలను, అసూయాగ్రస్తమైన స్పర్థను కాల రాచి పారేస్తావు. అప్పుడవి కొత్తిమెర పురుగుల్లాగా ఎంత ఎగిరినా నీకాలి చీలమండలదాటి ఎగరలేవు...."—ఇట్లా పరిపరి విధాల పర్యాలోచిస్తున్నాడు అనాయ్.

అనాయ్ ఆలోచనలకు ఒక ఒకవిధంగా వాడినీ, వేడినీ ఒక పునస్ఫూర్తినీ కలిగించిన పావ్‌లోవ్ నిజానికి, అతనికి ఒక విశ్వస నీయుడైన మిత్రుడు. ఈ స్నేహానుభూతి అభివ్యక్తమైనప్పుడు, అనాయ్‌కి గుండెలమీది బరువు దించేసినట్లయ్యేది.

అబిష్‌కు పావ్‌లోవ్ వ్రాసిన జాబులో కూడా ఒక మంచి వార్త వచ్చింది. పోలీసు అధికార్లు ఇంతకాలంనుంచీ కడుతున్న ఒక అడ్డుగోడ, ఒక అవరోధం కూలిపోయింది: ఆసాంతానికి ఎట్లాగైతేనేం పావ్‌లోవ్, తన ప్రియురాలు సాషాను సాధికారంగా వివాహం చేసుకోగలిగాడు... పావ్‌లోవ్‌తో తను ఇదివరలో మాట్లా డిన దానినిబట్టి, ఖార్కోవ్ విశ్వవిద్యాలయంనుంచి, ఆయనతోపాటు ఆవిడకూడా బహిష్కరించబడిందనీ, ఎన్నోసార్లు ప్రవాసాలను, దేశాంతర కారాగారవాసాలను ఆయనతోపాటు ఆవిడా అనుభవించిం దనీ అబిష్‌కు తెలుసు.

నిజానికి ఆవిడో విప్లవకారిణి. ఈ దుర్భర పరిస్థితులను, అగ్నిపరీక్షలను ఆవిడ సాహసంతో ఎదుర్కొన్నది. పావ్‌లోవ్‌తో పాటు టొబొల్‌స్క్‌లో ప్రవాసశిక్షకు గురిచెయ్యబడినప్పుడు ఆ ఇద్దరి జీవితాలు ఏకమైనాయి. అయితే అనతికాలంలోనే ఇద్దరికీ ఎడబాటు సంప్రాప్తమైంది. దీనికి హేతువు పావ్‌లోవ్ సెమిపలతిన్స్క్‌కు పంపబడటమే.

కష్టభూయిష్టమైన పావ్‌లోవ్ జీవితాన్ని అబిష్, తన యువ సహచరుల మధ్యన బిగ్గరగా తలపోసుకుంటూ, ఎంతటి కష్టపరం పరలైనా దృఢసంకల్పుడైన, కృతనిశ్చయుడైన ఒక వ్యక్తిని స్వతంత్ర పోరాటంలో వెనకకు లాగలేవు అన్నాడు.

"ఫెయొదర్ ఇవనోవిచ్‌కి ప్రవాస శిక్ష రెండుమాట్లు ఎట్లా విధించబడింది?" అని అడిగాడు వ్యాకులంగా మగాష్, "ఒకే నేరానికి, ఒకేవ్యక్తికి, రెండుసార్లు శిక్ష విధించడం ఎట్లా సాధ్య పడుతుంది?"

అబిష్ వాళ్ళకు ఆ సంఘటన ఎట్లా జరిగిందీ చెప్పాడు:

"ఫెయొదర్ ఇవనోవిచ్ సైబీరియాకు జారు చక్రవర్తి అలె గ్జాండర్ II. హత్యకు పూర్వమే ప్రవాసానికి పంపబడ్డాడు....రష్యా దేశ ప్రజలు, అలెగ్జాండర్ III రాచరికానికి రాగానే, రాజభక్తి ప్రమాణం చెయ్యవలసి వచ్చినప్పుడు, ఫెయొదర్ ఇవనోవిచ్ తన విశ్వాసాన్ని క్రియాత్మకంగా ఆచరణలో పెట్టాడు. రాజభక్తి ప్రమాణ స్వీకారం చెయ్యమని ఫెయొదర్ అడగబడినప్పుడు, ఆయన "నా యువక జీవితం ఇదివరకటి జార్ చక్రవర్తి ఆజ్ఞాపన కారణ ముగా ప్రవాసానికి బలి అయిపోయింది. ఒక జారు విధించిన యీ జారుణశిక్షకు లోనైన నేను, ఇంకొక జారుకు ఎట్లా విధేయుణ్ని కాగలుగుతాను? నన్ను ప్రమాణ స్వీకారం చెయ్యమనడందేనికి? కొత్త జారు, పాత జారు విధించిన ప్రవాస శిక్షనుంచి నన్ను విడు దల చెయ్యలేదు. నామటుకు నాకు యీ ఇద్దరూ ఒకటే. నేను ఏ ప్రభుత్వాన్ని ద్వేషిస్తున్నానో ఆ ప్రభుత్వంపట్ల కృత్రిమంగా ప్రభు భక్తిని ప్రకటించలేను....బహిష్కృతుడు పావ్‌లోవ్, జారులతో ఏమాత్రం జోక్యంలేని ప్రవాసిగానే ఉంటాడు," అని సమాధాన మిచ్చాడు.

"మనిషంటే ఆయనే! అదే సరియైన ప్రత్యుత్తరం అంటే!" అని ప్రశంసా పూర్వకమైన హర్షాన్ని ప్రకటించారు మగాష్, కికితాయ్‌లు.

"అవును, అట్లా చెప్పడానికి గుండెవుండాలి," అని చెప్ప సాగాడు అబిష్. ప్రసిద్ధ రష్యన్ రచయిత కొరొలెంకో కూడా అదే విధంగా ప్రవర్తించాడు. ఆయన ఉరల్స్‌లో ప్రవాసిగా ఉన్నాడు. అందుకని ఆ తర్వాత సైబీరియాకు పంపబడ్డాడు. పావ్‌లోవ్ టొబొల్‌స్క్‌నుంచి ఓమ్‌స్క్‌కు పంపబడ్డాడు. సాషానుకూడా ఆయ నతోపాటు ఓమ్‌స్క్‌కు పంపవలసినదిగా కోరబడినప్పటికీ, సైని కాధికారులు ఆమెను పావ్‌లోవ్ పత్నిగా గుర్తించటానికి నిరాకరించి పంపలేదు. బహిష్కృతులు సాధికారపు అనుమతి పొందిన పిమ్మ టనే వివాహం చేసుకోవలసి ఉంటుంది, సాధారణంగా అటువంటి అనుమతి పొందడమన్నది కూడా దుర్లభమే. కాగా, సాషా దేశాం తరవాస శిక్ష పూర్తికావడంతోటే, సెమిపలతిన్స్క్‌లో దీర్ఘకాలం నివాసం చెయ్యడానికి అనుమతించబడలేదు. ఆ విడను సైనికాధి కారులు అందుకు అవహేళన కూడా చేశారు. అయితే ఇప్పుడు, ఫెయొదర్ సెయింట్ పీటర్స్‌బర్గ్ నుండి అనుమతిపొంది, సెమి పలతిన్స్క్‌కు వచ్చి చిట్టచివరకు సాధికారంగా ఆ విడను వివాహం చేసుకున్నట్టు వ్రాస్తున్నాడు...."

అబిష్ చెప్పిన ఈ ఉదంతాన్ని డేరాలోవున్న ప్రజలందరూ అత్యంత సానుభూతితో విన్నారు. సాషా పట్టుదలనూ, నిర్వక్రమైన ఆమె కార్యదీక్షనూ, దుర్భేద్యమైన ఆమె సాహసాన్నీ, శక్తినీ నిశ్చలతను గురించి యువజనులు పరిపరివిధాల చర్చించుకున్నారు "అపూర్వ సాహసిక!...విశ్వాసపాత్రమైన హృదయం!..." మొదలైన



ప్రశంసలు అన్నివైపులనుంచి వినిపిస్తున్నాయి.

అబాయ్‌కి వచ్చిన ఉత్తరువులపట్ల కల్లోల మనస్కుడైన మగాష్, రానున్న ప్రమాదం వైపుకి సంభాషణ త్రిప్పబూనాడు. అయితే తండ్రి ఆ ప్రమాద ప్రసక్తిని అటుంచి పావ్‌లోవ్ గురించి మాటలాడడం మొదలు పెట్టాడు

"ఇప్పుడు అతని విధను శ్రద్ధగా ఆలకిస్తుంటే, మన కజఖ్కులకు రష్యాను గురించీ, రష్యన్ల గురించీ ఎంత తెలుసు? మరీ నన్ను న్యాయ విచారణపేరట హింసిస్తున్న ఈ ఉజర్బాయిలకు రష్యంపై పరిజ్ఞానం వున్నదా? వాళ్ళకు వచ్చిన మాటలల్లా "శ్వేత జారు పరిపాలకులు," "పటాలం," "ఉజెద్ అధికారి," ఆ నాలుగు ముక్కల్నే పదేపదే ప్రయోగిస్తుంటారు। పటాలాల అధికారులను, పోలీసు అధికారులను, సైనిక దళాలను తప్పిస్తే మరో ఇతర విషయాన్ని ఊహించనైనా ఊహించలేరు ఇంక పావ్‌లోవ్ లాంటి రష్యన్ల గురించి వాళ్ళేం ఆలోచించగలరు?"

పీనుగపెట్టిపిన కప్పే నల్లటి ముసుగులాగా అబాయ్ ముఖం మాడిపోయింది. చారెడేసి కళ్ళు ఇంతలింతలైనాయి. అతని యువక మిత్రులు, ఆయనలో ఇంతటి ఆందోళననూ, ఈ కళవళికనూ చూచి బహుకాలమైంది.

"అయితేమటుకు ఈ అల్పులు, పావ్‌లోవ్ తలమీదినుంచి ఊడిపడ్డ ఒక వెంట్రుకవాసి చేస్తారా? వాళ్ళా, ఆయన్ను "నేరస్థు" డనేది? ఇట్లు ప్రశ్నిస్తూనే ఉద్విగ్నంగా మాటలాడుతున్నాడు: "సృష్టి కర్తకు ధన్యవాదాలు. రష్యాకూడా మనలోటిపాటిదే! దానికి బలీయమైన భాషసంపద ఉంది, ప్రగతి, సుసంపన్నమైన కళవుంది. మన ప్రజలు విధ్వంసనకు గురియైనప్పటికీ, దురదృష్టాలకు బలియైనప్పటికీ, పట్టె కాళ్ళతో *మూకుమ్మడిగా ఉత్తరాది వలస పోవలసివచ్చినప్పటికి, ఎంతటి దుర్గతికి, దుర్గతికి పాల్పడక తప్పనప్పటికీ, రష్యా మనల్ని ఆదుకొన్నది. అప్పట్లో రష్యావాసులూ, మన పొరుగుననే చెదురుమదురుగా విస్తరించివున్న స్టెప్పీలలో అజ్ఞానంలో, హింసాపాలనలో జీవించారు. వాళ్ళ మొట్టమొదటి దూత, ప్రప్రథమ వైతాళికుడూ ఆల్టైన్సరిన్. నేను సైతం ఆయన అడుగుజాడలలోనే నడవడానికి నిశ్చయించుకొన్నాను. రష్యన్లలో ఉత్తములైన వారిని కలుసుకోగలగడం నా మహాదృష్టం, నా మహా భాగ్యంగా భావిస్తున్నాను ..నేను ఆ ఉత్తముల అండదండలమీద ఆధారపడుతున్నాను, ఆధారపడ్డాను, నేనేకాదు, మీరుకూడా ఆ రష్యన్లు కల్పించిన విద్యా విజ్ఞానాలమీద ఆధారపడుతూ ఇటువంటి ప్రజలను అనుగమిస్తున్నారు! వారు, మన కళ్ళు తెరచి జీవితం ఏమిటో చూపించారు

---

* అక్తబాన్ షుబైరెన్ది, అన్న పదానికి అర్థం, పట్టెకాళ్ళతో సర్వ జనులూ పదయాత్రలో పోవడమని. ఈ సంఘటన, సిర్-దర్యా తీరంనుంచి, 18వ శతాబ్దంలో జరిగిన జుంగారీ దాడుల కారణంగా, కజఖ్కులు ఉత్తరాదిన ఆరాల్ స్టెప్పీ ప్రాంతాలకు, కాలినడకన పాదరక్షలు లేకుండా మూకుమ్మడిగా తరలిపోయిన, నాటి అంశానికి సంబంధించినది.



కజఖ్ రచయిత ముఖ్తార్ ఔఎజోవ్, ఆయన కుమారుడు

ఎంతటి సుఖప్రదమైన జీవితం నా తరువాతి తరాన్ని, మీ తరువాత తరాలను ఎదురుచూస్తున్నది! పొరుగు రష్యాకు దగ్గరకు వాళ్ళు సమిష్టిగా పోగలుగుతారు, సమిష్టిగా వ్యవహరించ గలుగుతారు. అదొక సకలజాతుల సమాఖ్యగా రూపొందుతుంది. చరిత్ర తన గతిని మార్చుకొంటుంది. నేను సరిగ్గానే చెబుతున్నానా అబిష్?" అన్నాడు. హఠాత్తుగా తన కొడుకు ప్రక్కకు తిరిగి.

ఆ ఉద్రేకంలో ఒక్క మాటకూడా రాక, అవునన్నట్లు తలూపాడు. అమృతతుల్యమైన అబాయ్ పలుకు పలుకునూ ఆస్వాదిస్తున్న తదితర యువకులంతా, ఆయన ఆలోచనలను పోకడనను గమనిస్తున్నారు.

"యాత్రిస్తోన్న యీ బిడారులను, ఆ రమణీయ ప్రాంతాలకు నేనేగనక నడిపించగలిగినట్టయితే నా శ్రమ వ్యర్థంకాదు!" అంటూ తన సంభాషణ సాగిస్తున్నాడు. "నేను అనుభవించిన కష్టపరంపరలే అగ్నిపరీక్షలే నా విజయ పరంపరలవుతాయి. సౌఖ్యానికి మార్గాన్ని కనిపెట్టడం అంత సులభం కాదని అవి బహుశా ఇతరులకు ప్రబోధించవచ్చు ...ఈ దారి కష్టభూయిష్టమై వుందనీ, కంటకావృతమైందనీ విస్పష్టం చెయ్యొచ్చు ..ఈ సంగతి మీకై మీరే తెలుసుకోవచ్చు, రష్యన్లలో ఉత్తములైన వారిని దీనికి నిదర్శనగా తీసుకోవచ్చు. ప్రసిద్ధ రష్యన్ కవులు పుష్కిన్. లెర్మన్‌తోవ్. నా మొద



మొదటి రష్యన్ మిత్రులు ఎటువంటి బాధలు పడ్డారు? ఎంతటి అగ్నిపరీక్షలకు లోనయ్యారు? హెర్జెన్, చెర్నిషెవ్‌స్కీల మాటేమిటి?....మన మధ్యనే వున్న పావ్‌లోవ్ జీవితం, కష్టాల గొలుసు, కారాగారాల, ప్రవాసాల సంక్షుభిత శృంగాటకం. ఎన్నడన్నా ఆయన. వీటిని గురించి ఒక్కసారైనా అసంతృప్తి ప్రకటించాడా....ఎప్పుడన్నా ఆ కష్టాలు ఇటువంటివని సణిగినట్టు విన్నారా? రష్యన్ వీరులు పౌరాణిక గాథలకు సైతం అపురూపమైన, అపూర్వమైన సాహసాన్ని ప్రదర్శించారు, అంతులేని పట్టుదల! ఆ వీరుల జీవిత చరిత్రలమీద మన బాలలకు, యువక తరానికి చెందిన వారికి విద్య గరపాలి."

ఆలోచనా నిమగ్నుడైన అబాయ్ కాస్త మౌనం వహించి, మళ్ళీ మందమందంగా మృదువుగా చెప్పసాగాడు :

"నాకై నేను, అవంతా కళ్ళారా చూడగలిగేటంతవరకూ జీవించక పోవచ్చు....కాని మీ ముందున్నకాలం అపరిమితంగా మారితీరుతుంది. అప్పటి జీవితమే వేరు, ఆ చట్టములే వేరు. ఒక అపూర్వ సౌఖ్య ప్రజలకు లభ్యమవుతుంది....ఈ సుభ సమయం వస్తుంది!....నేనేగనక నా మనోనేత్రంతో చూడగలిగిన ఆ భావి భవన నిర్మాణానికి ఒక్క ఇటుకను పేర్చగలిగినా నా జీవిత స్వప్నం నిజమవుతుంది. నీవేగనక నీ ప్రజలను, సౌఖ్యానికి చేరువగా తీసుక రాగలగడానికి ఏవిధంగానైనా సాయపడగలిగానని చెప్పుకోగలిగినట్టయితే నిన్ను నీవు, అమర్త్యునిగా లెక్కించుకోవచ్చు. ప్రపంచం ప్రళయాన్ని సమీపిస్తున్నదని మన మహమ్మదీయ మత గురువులు యుగాల తరబడి చెప్పుకపోవచ్చు! కానీ లయించనున్నది ప్రపంచం కాదు, దుర్మార్గం....మనం చెయ్యవలసినదల్లా ఈ దుర్మార్గాన్ని నశింపజెయ్యను మన ప్రజల్ని ఆయత్తపరచడమే...."

వాళ్ళ చూపులన్నీ అబాయ్‌మీదనే లగ్నమై వున్నాయి. దార్మెన్, కకితాయ్ ఇంకా ఆయన ఏమి చెబుతాడో విందామన్న నిరీక్షణలో ఉన్నారు. అబాయ్ అక్కడితో ముగించాడు. నల్లటి డబ్బీని ఒకటితీసి, అరచేతులు దులుపుకొని, అందులోనుంచి చిటికెడు నస్యంతీసి నోట్లో వేసుకొని, ఒక్కసారి యువజనులందర్నీ పరికిస్తున్నట్టు ఒక్క చూపు చూచాడు. అందరూ నిశ్శబ్దంగా వున్నప్పటికీ వాళ్ళ ముఖాలలో ఒక వినూత్న ప్రేరణ స్పష్టంగా కనుపిస్తున్నది. ఆ మాదిరిగా అబాయ్ మాటలాడడం— మరీ అంత ఉద్రిక్తంగా, అంత ధారాళంగా ఆయన తన మనసులోని మాటను, ఆలోచనలను, ఆకాంక్షలను చెప్పడం వాళ్ళు విని ఎంతోకాలమైంది.

"ఫెయొదొర్ ఇవనోవిచ్, మిమ్మల్ని ఆలోచించేటట్టు చేశాడు కదూ అబాయ్ —ఆగా" అని సంభ్రమాశ్చర్యాలతో అడిగి కకితాయ్, "ఆయన ఆశించేదంతా నిజమవుగాక!" అన్నాడు.

అబిష్ అన్నాడు "మీరు చెప్పినదంతా అక్షరరూపంలో కాయితం మీద కెక్కించ దగింది. భవిష్యత్తుతో మీరు ముఖాముఖి మాటలాడుతున్నారనిపించింది. భావి తరాలకు మీరు ఎరుకచెబుతున్నట్టు, భావితరాల మనసు తెలిసి మాటలాడుతున్నట్టుగావుంది."

మగాష్, కకితాయ్ లిద్దరూ అబిష్ అభిప్రాయాన్ని తామూ సమర్థిస్తున్నట్టు ఒకరివంక మరొకరు చూపుల ప్రసరింపజేసుకొన్నారు. ఇంతలో అబాయ్ కాదన్నట్టు సంజ్ఞాపూర్వకంగా తల పంకించాడు.

"నేనేకాదు ఈ మాటల్ని మొట్టమొదట చెప్పింది, నీ మాటకు నువ్వేరగవా అబిష్" అంటూ తన చేతుల్ని ఎదురుగ్గా బల్లమీద తెరచివుంచిన నోటుపుస్తకంమీదికి పోనిస్తూ అబాయ్. పుష్కిన్ ఇలా వ్రాశాడన్నాడు :

"మేదురసావర తారా పథాన, పొడుస్తుంది చుక్క నమ్మండి కామ్రేడ్స్, నామాట! విరుస్తుంది సుఖజీవన."

"అవును,"...."అయితే, మన కజఖ్కులలో ఇటువంటి భవిష్యద్దర్శన కలిగి, ఈ భావాన్ని ఇంతటి దృఢనమ్మకతో రూపొందించగలిగిన వ్యక్తంటూ ఇంతకు మునుపు లేడు" అన్నాడు అబిష్.

అబాయ్ ప్రత్యుత్తరం చెప్పలేదు. అబిష్, పావ్‌లోవ్ జాబును పైకితీసి, ఆ డేరాలోని ప్రజలను సంబోధిస్తూ ఇలా చెప్పాడు: "ఇంకా వినండి ఫెయొదొర్ ఇవనొవిచ్ ఏమి వ్రాస్తున్నదీ, నాన్నగారూ, ఆయన ఇందులో మీ అభిప్రాయాన్నే వివరిస్తున్నట్టుంది," అని ఆ తర్వాత పావ్‌లోవ్ మాటల్ని కజఖ్ భాషలోకి అనువదించి చెప్పాడు: ఇబ్రహీమ్ కునన్‌బయేవిచ్, మీ రచనలు, ముఖ్యంగా మీ కవిత్వం భవిష్యత్తుకోసం విరచితమైంది. ఎక్కడైతే ప్రజలకు జీవితం విశిష్టంగా, రమణీయంగా వుంటుందో, మీ కావ్యాలు అక్కడ భవిష్యత్తుకు రూపులు దిద్దుతుంటాయి, ఇటువంటి కాలం వస్తుంది. ఇది రాక తప్పించుకోలేదు, ఏగొలుసులూ, ఏ శిక్ష, ఎంతటి దారుణశక్తి అయినా దీనిదారి నడ్డలేవు! మీ ప్రజల్ని ఏకం కావించండి, మీ యువకుల్ని సన్నద్ధపరచండి, ఎందువల్లనంటే ఎంత త్వరగా ప్రజలు భవిష్యత్తుకు సన్నాహాలు చేసుకొంటే అంత బాగా దానిని అర్థం చేసుకోగలుగుతారు, దాని ఫలితాలను సమగ్రంగా వివేకంతో ప్రశంసించగలుగుతారు. అప్పుడే వివిధ ఫలాలను అవిరళంగా చవిచూడగలగడం సంభవమవుతుంది!"

"హర్షించదగిన అభిప్రాయం! ఫెయొదర్ ఇవనోవిచ్ చెప్పినదంతా, ప్రజలకోసం పోరాడే ఒక నిజమైన విప్లవకారుని ఆదేశంగా స్వీకరించవలసి ఉంటుంది." అన్నాడు అబాయ్ తీవ్రమైన సానుకంపతో.

పావ్‌లోవ్ జాబును తీసుకొని, భద్రంగా మడిచి. జేబులో పెట్టుకొని, స్వగ్రామానికి తిరిగి వెళ్ళడానికని లేచాడు.





## బాలానందం

# బాతు కథ 

అనగాఅనగా ఒకరైతు. ఆయనకో భార్య. ఆ దంపతులకు ఒక పిల్ల, పిల్లవాడూ కలిగారు. పిల్లపేరు మాషా, పిల్లవాడి పేరు వాన్యా.

ఒకరోజు, తల్లితండ్రీ ప్రక్కనేవున్న పట్నానికి పోతూ మాషాను పిలిచి ఇలా చెప్పారు :

"చూడమ్మా. నువ్వు మంచి పిల్లవనిపించుకోవాలి. తమ్ముణ్ణి చూసుకుంటూ భద్రంగా ఇల్లు కనిపెట్టుకొని వుండాలి. ఇంటి కడప దాటి బయటకు అడుగుపెట్టకూడదు. మేం చెప్పినట్టు చేస్తే, మార్కెట్టునుంచి తిరిగి వచ్చేటప్పుడు నీకో మంచి బహుమతి తెస్తాం."

తల్లి తండ్రులు కాస్త అట్లా పోయినారో లేదో, మాషా, తమ్ముణ్ణి కిటికీ దగ్గర పచ్చగడ్డిమీద కూర్చోబెట్టి తన స్నేహితుల దగ్గరికి ఆడుకోడానికి పరిగెత్తింది.

అంతలో హఠాత్తుగా ఒక పెద్ద బాతుల గుంపు వచ్చి, క్రింద ఆడుకుంటున్న వాన్యాను తన్నుకుపోయ్యాయి.

మాషా ఇంటికొచ్చేసరికి, తమ్ముడు కనపడకపొయ్యేటప్పటికి నిర్ఘాంతపోయింది!

ఇటూ అటూ పరుగెత్తింది వెతకటానికి, పాపం వాన్యా ఎక్కడా కనుపించలేదు,

పెద్దగా పేరున పిలిచింది, ఊహూ వాన్యా జవాబు చెప్పాడు కాదు. మాషా దుఃఖం ఆపుకోలేక పెద్దపెట్టున ఏడ్చింది. అయితే ఒలికిన పాలకు ఏడ్చి లాభమేమిటి. తప్పు తనదాయె, తన చిట్టి తమ్ముణ్ణి తనే వెతకాలి.

చిన్నపిల్ల మాషా, పొలంమీదికి వెళ్ళి నాలుగు దిక్కులా కలయ వెతికింది. తల పైకెత్తి చూచింది, పైన ఒక పెద్ద బాతుల మంద, ఆకాశంమీద ఎగురుతుండడం కనుపించింది. కారడవి అంచులమీదుగా అవి బారులుతీరి పోతున్నాయి.

మాషా అవి తమ్ముణ్ణి ఎగరేసుకపోతున్నాయని గ్రహించింది వెంటనే వాటిని వెన్నంటింది.

పరిగెత్తి పరిగెత్తి ఎంతో దూరం పోయింది, ఒక పొలం మధ్యలో ఒక పెద్ద పొయ్యి వుండటంచూచి, దానిమీదికెక్కింది :

"ఓ పొయ్యా, పొయ్యా బాతులమంద ఎటు ఎగిరివెళ్ళాయో చెప్పు" అంది.

"మొటమొదట నాకంత తిండివెయ్యి, అన్ని చిదుకులు తెచ్చి పడేస్తే చెబుతాను" అన్నది పొయ్యి.

మాషా అన్ని చిదుకులేరుకొచ్చి, పొయ్యిలో వేసింది. ఆ తర్వాత బాతుల గుంపు ఎటుపోయిందో చెప్పింది పొయ్యి.

ఆ దారినే పరిగెత్తింది మాషా. కొంత దూరం పొయ్యేసరికి ఒక పొలం మధ్యన, ఒక పెద్ద సీమరేగుచెట్టు కనుపించింది, దాని కొమ్మలన్నీ ఎర్రగా మాగిన పండ్లతోనిండి బాగా బరువెక్కి ఉన్నాయి. అవి బాగా నేలకు తాకుతూ వంగి ఉన్నాయి. మాషా ఆ సీమరేగిచెట్టు నడిగింది :

"ఓ సీమరేగూ, సీమరేగూ బాతులమంద ఎటుపోయినాయో చెప్పు" అని.

"కాస్త యీపండ్లను దులుపమ్మా,"...."ఈ బరువును తట్టుకోలేకుండా వున్నా, కొమ్మలన్నీ వంగిపోతున్నాయి" అంది సీమరేగు చెట్టు.

అందుకని మాషా చెట్టు కొమ్మలన్నింటినీ ఒక్క ఊపుఊపి, పండ్లన్నీ దులిపేసింది, సీమరేగు నిటారుగా కొమ్మల్నిచాచి, ఆకులన్నీ విప్పార్చి, బాతులమంద ఎటు ఎగిరిపోయిందీ చూపుడు వ్రేలుతో చూపినట్టు చూపించింది.

మాషా పరుగెత్తి పరుగెత్తి ఒక పాల నది వొడ్డుకు వచ్చింది. నది అంచులు చక్కెర పాకంబట్టినట్టు, బాగా జిల్లికలాగావున్నాయి. మాషా నది దగ్గరకొచ్చి వేడుకొన్నది :

"జిల్లిక లంచుకట్టుకొనున్న ఓ పాలనదీ, బాతుల గుంపు ఎటుపోయిందో చెప్పవూ?"

నది అన్నది : "ఈ ప్రవాహానికి ఒక రాయి వచ్చి అడ్డుపడింది, పాలు ప్రవహించడం ఎంతో కష్టంగావుంది, మొట్టమొదట దాన్ని కాస్తతీసి అవతల పారేస్తే, ఆ మంద ఎటుపోయిందో చెబుతాను."

మాషా ఒకపెద్ద చెట్టు కొమ్మ విరగ్గొట్టి, దాని సాయంతో ఆ రాయిని తిన్నగా తీసేసింది.

రాయి తీసెయ్యడంతోటే నది జలజల పారడం మొదలు పెట్టింది. ఆ తర్వాత ఎటుపోవాలో చూపి, చిన్నపిల్ల మాషాకు ఆ దారినపోతే బాతులు కనిపిస్తాయని చెప్పింది నది.

మాషా అట్లాగే పరిగెత్తి పరిగెత్తి ఒక కారడవి దగ్గర కొచ్చింది. వచ్చివచ్చి ఒకపొదదగ్గర, దారితెలియక, ఏం చెయ్యాలో తోచక నిల్చున్నది. దూరంగా ఒకచెట్టు మొందెంవంక చూస్తున్నది. అక్కడొక ముండ్లపంది కూర్చొని వుంది.

"ఓ ముండ్లపందీ, ముండ్లపందీ, బాతులమంద ఎటుపోయిందో నువ్వు చూచావా?" అని ప్రశ్నించింది.

ముండ్లపంది అన్నది : "ఇదిగో, నేను ఎటు దొర్లుకుంటూ పోతే, నువ్వటు పరుగెత్తుకరా."





మంత్రపుబంతిలా అంతలో వుండచుట్టుక పోయింది. ఆ వుండ అల్లాగే దేవదారుచెట్ల మధ్యనుంచీ, కొండరావిచెట్ల సందుల్లో నుంచీ దొర్లుక పోతున్నది. దొర్లుకుంటూ, దొర్లుకుంటూ పోయి ఒక చిన్న గుడిసె దగ్గర కొచ్చింది.

మాషాను అటు చూచేటప్పటికి, మాంత్రికుడు బాబాయాగా కనుపించాడు. కడుపుతో జనపనార వొడుకుతున్నాడు. తల వాకిటి వసారాలో బంగారు సీమరేగు పండ్లతో చంటివాడు వాన్యా ఆడుకుంటున్నాడు.

మాషా సవ్వడి కాకుండా గుడిసె దగ్గరకు నింపాదిగా ప్రాకుతూ ప్రాకుతూ పోయి, తమ్ముణ్ణి తీసుకొని ఇంటిదారి పట్టింది.

కాస్సేపటికి, గుడిసె గవాక్షంలోనుంచి మాంత్రికుడు బాబా యాగా చూచేటప్పటికి, ఆయనకు, అయ్యో, ఆ పిల్లడు కనిపించ లేదు. వాడు పారిపొయ్యాడు.

మళ్ళీ తన బాతుల మందను పిలిచి మొరపెట్టుకున్నాడు :

“ఓ నా బాతుల్లారా, త్వరగా వెళ్ళి వాళ్ళను పట్టుకరండి. ఊఁ త్వరగా....”

బాతులు సర్రున ఆకాశం మీదికి ఎగిరాయి. కిలకిల్లాడుతూ, అవి మాషానూ, ఆ పిల్ల చిట్టి తమ్ముణ్ణీ వెంబడించాయి.

తమ్ముణ్ణి ఎత్తుకొని, యీలోగా మాషా ఎంత తొందరగా పరుగెత్తగలదో అంత తొందరగా పరిగెత్తుతున్నది.

ఆ పిల్ల నాలుగు దిక్కులూ పరికించిచూచి పైన ఎగురుతున్న బాతుల మందను పసికట్టింది....

ఏం చెయ్యగలదు ఆ పసిది? త్వరత్వరగా జిల్లిక అంచుల పాలనది దగ్గరకు పరిగెత్తింది.

ఆ బాతుల గుంపూ ఇంతలో, ఆ పిల్లవెంట పడ్డది. అవి బిగ్గరగా కిలకిలారావం చేస్తూ, రెక్కలు తపతప లాడిస్తున్నాయి.

“నదీ, నదీ” ........ “మమ్మల్ని దాచెసెయ్యి తొందరగా దాచు నదీ” అని మొరపెట్టుకుంది మాషా.

నిటారుగావున్న వొడ్డు నీళ్ళల్లో, ఆ నది మాషానూ, మాషా తమ్ముణ్ణీ బాతుల కంటబడకుండా దాచేసింది.

బాతులమంద మాషాను చూడకుండానే రివ్వున ఎగిరిపోయింది.

మాషా తిన్నగా వొడ్డెక్కి, నదికి టూందాగా కృతజ్ఞతలు చెప్పి, తన దారిన తాను పోసాగింది చరచరా.

ఇంతలో బాతులగుంపు ఆ పిల్లను పసికట్టి, వెనక్కు తిరిగి ఆపిల్లవంకకే పరుగెత్తుకొస్తున్నది.

మాషా బిరబిరా సీమరేగు చెట్టుదగ్గరకు పరుగెత్తింది.

“ఓ సీమరేగూ, సీమరేగూ నన్ను దాచేసెయ్యి” అన్నది మాషా.

సీమరేగు ఆ పిల్లను తన కొమ్మల ఆకుల మధ్యన దాచేసింది. బాతులగుంపు చెట్టుచుట్టూరా ప్రదక్షిణంచేసింది. ఎన్ని చుట్లు తిరిగితే మటుకు ఏముంది, మాషాగానీ, మాషా తమ్ముడు వాన్యాగానీ వాటి కంటబడలేదు. అవి సర్రున చెట్టుదాటి పోయినాయి.

మాషా తిన్నగా చెట్టు నీడనుంచి దాటుకుంటూ, సీమరేగుకు అభినందనాలు చెప్పి మళ్ళీ పరుగు ఎత్తుకొన్నది.

తమ్ముడి చెయ్యిపట్టుకొని ఆ పిల్ల ఒకటే పరుగు తీస్తున్నది. దురదృష్ట వశాత్తు యీసారి మళ్ళీ బాతులకంటబడింది. అవి గిర్రున వచ్చి వాలడం మొదలు పెట్టాయి.

ఇంకా పెద్దగా కిలకిలారవం చేస్తూ సరిగ్గా ఆపిల్ల నడినెత్తిన రెక్కలు తపతప లాడించ మొదలుపెట్టాయి ఆ బాతులు. చేతులోని వాన్యాను గుంజుకున్నంత పని అయింది. ఆ పిల్ల అదృష్టం వంతే, సరిగ్గా దగ్గర్లో పొయ్యి కనుపించింది.

మాషా చివాలున పొయ్యి దగ్గరకు ఒక్కగంతువేసి అన్నది :

“ఓ పొయ్యీ, పొయ్యీ నన్ను రక్షించవూ.”

పొయ్యి మాషాను దాచి, కట్టెలువేసే ద్వారపు తలుపు బిగించింది.

బాతుల మంద పొయ్యిదగ్గర కొచ్చి పడింది. వాటి ముక్కులతో అవి పొయ్యి తలుపు నెట్టడం మొదలుపెట్టాయి. ససేమిరా, ఆ తలుపు నెట్టడం వాటికి అలవి కాలేదు. ఇంక అవి పొయ్యి పొగగొట్టంలో నుంచి లోపలికి దూరడానికి ప్రయత్నించాయి. అదీ వాటివల్ల కాలేదు, అయింతల్లా వాటి రెక్కలనిండా పొగ మసి అంటించుకోవడం.

పొయ్యిచుట్టూ గిరగిర ప్రదక్షిణం చేశాయి. కిలకిల్లాడాయి. ఎంత కొట్టుకున్నా వల్లగాక, మళ్ళీ అవి చివరకు నిరాశ చేసుకొని మాంత్రికుడు బాబా యాగా దగ్గరకు తిరిగి పొయ్యాయి.

మాషా, మాషా తమ్ముడూ తిన్నగా పొయ్యిలోనుంచి ప్రాకుతూ, ప్రాకుతూ, బయటపడ్డారు. వాళ్ళు పరుగెత్త గలిగినంత వేగంగా పరుగెత్తి, ఆ ఇద్దరూ కడపటికి ఇల్లు చేరుకున్నారు.

మాషా ఇంటికి పోగానే, తమ్ముడికి నీళ్ళుపోసి, వొళ్ళు తుడిచి శుభ్రంగా తలదువ్వి, వాణ్ణి ఒక బెంచీమీద కూర్చోబెట్టి, తను వాడి ప్రక్కనే కూర్చొన్నది.

ఆ తర్వాత, కాస్సేపటికి వాళ్ళ నాన్నా అమ్మా పట్నంనుంచి బహుమతులతో ఇంటికి రానే వచ్చారు.





కజఖ్ చిత్రకారుడు అబైల్‌ఖాన్ కస్తెయేవ్

ఓ చిత్రమనిపించవచ్చునుగానీ, కజఖ్ చిత్రకారుడు, అబైల్ఖాన్ కస్తెయేవ్, పద్దెనిమిదేళ్ళు వచ్చేవరకు పెన్సిలూ, కాయితం ముఖం ఎరగడు. పూర్వపు కజఖస్తాన్‌లో చదువన్నది, దినదినం కూలి చేసుక పొట్టపోసుకునేవాడికి అందుబాటులో వున్న విషయం కాదు. అందులోనూ కస్తెయేవ్ తను కూలి చేసుకోవడమేకాదు అసలు, కూలివాడి కొడుకు.

ప్రతిభావంతుడైన యీ యువకుడి కళ్ళముందు జరిగినదంతా, విప్లవానికి పూర్వపు కజఖ్ గ్రామ జీవితం; భూస్వాముల, సామాన్య ప్రజల పీకలమీద కూర్చునేవారి భోగలాలసత—అతని మనస్సుకు బాగా హత్తుకపోయాయి. ఆ జ్ఞాపకాలు ఎన్నటికీ చెరిగిపోలేదు. వాటిని ఆ తరువాత ఆయన రానున్న తరాలు తమ తాతతండ్రులు ఎలా జీవించారో తెలుసుకోగలగడానికని చిత్రీకరించాడు.

కస్తెయేవ్ కళకు తరచు వస్తువైన విషయం, చాలావరకు, పాతకాలపు జీవితాన్ని తుడిచిపెట్టిన మహత్తర పరివర్తనలు : సమకాలీన కజఖ్ గ్రామ జీవిత దృశ్యాలు, ఆ గ్రామ ప్రజలు, ఆ ప్రజల ఆశలు, ఆకాంక్షలు, ఆనందాలు.

తన కళను విశేషంగా ఆయన, ప్రజల దాస్య విమోచనానికి పాటుపడిన విజేతలకు అంకితం చేశాడు. "నేను చేసిన మంచిపని, వేసిన ఉత్తమచిత్రం"...."మాజాతీయ వీరుడు అమన్గెల్డీ పొర్ట్రయిట్ రచన" అంటాడు కస్తెయేవ్. ఇక్కడ, ఆ చిత్రానికి సంబంధించిన ఒక గాథ వున్నది. కజఖ్ తిరుగుబాటుకు నాయకుడని, చాలా వరకూ కథగా చెప్పుకోబడుతున్న అమన్‌గెల్డీ ఇమనోవ్‌కూ, దీనికీ పోలికలేదు. చిత్రకారుడు, ఆ వీరుణ్ణి వీలయినంతవరకు, తను మూర్తిమంతం చెయ్యడానికి కృతనిశ్చయుడైనాడు. ఏదో ఒక తీరున, యీ కృషికి ఉద్యమించాడు. అందుచేత ఆ వీరుని స్వగ్రామం 'తుర్గెయ్'కి వెళ్ళాడు. ఆ చిత్రకారుడు, తనకు తానై అమన్‌గెల్డీని ఎన్నడూ చూడలేదు. అయితే ఆ తిరుగుబాటు నాయకుని స్నేహితులనూ, బంధువులనూ గుచ్చి గుచ్చి అడిగి, ఆ వీరుని పోలికలు, కదలికలు, అలవాట్లు నడవడికను గురించి తెలుసుకున్నాడు. అమన్‌గెల్డీని పోలినట్టున్న పోలికలు కలిగినవాడని పేర్కొనబడ్డ అతని బంధువులందరి చిత్రాలను అసంఖ్యాకంగా లిఖించాడు. అయిదు సంవత్సరాల నిర్విరామ కృషి ఫలితంగా, వందలాది భంగిమలు, వందలకొలది చిత్రాలను గీసి, వాటి నిగ్గు తేల్చి తాను రూపించుకొన్న యీ వీరుని, తన యీ చిట్టచివరి చిత్రంలో మూర్తిమంతం చేశాడు. అమన్‌గెల్డీని ఎరిగిన వారందరికీ ముమ్మూర్తులా యీ చిత్రం ఆయనను కళ్ళకు కట్టడమేగాకుండా, ఆ వీరాగ్రేసరుని పాత్రను ప్రస్ఫుటం చేయగలిగిన యీ కళాకారుని ప్రతిభ అచ్చెరువు గొలిపింది.

నిన్న నిరక్షరాస్యుడైన కూలీ కస్తయేవ్, యీనాడు, కజఖ్ రిపబ్లిక్ ప్రజా కళాకారుడనే ఉత్తమ బిరుదాంచితుడైన ఒక ప్రసిద్ధ కళావేత్త.

---

సామ్యవాద వాస్తవికత-సోవియట్ సాహిత్య సృజనాత్మక రీతి
(30వ పుట తరువాయి)

వ్యంగాన్ని ప్రదర్శించే కాన్‌స్తాంతిన్ ఫెడిన్, తన రచనలలో అగ్నిని కురిపించే "ఆశాభరిత విషాదం" రచయిత వ్స్యావొలోద్ విషినేవ్స్కీ, చెకోవ్ వలె కావ్యాత్మకంగా రచన సాగించే అరబ్‌జోవ్, రొమాంటిక్ రచయిత పాస్తోవిస్కీ, పటుతరమైన ప్రచార సాహిత్యానికి పేరుబడ్డ ఇల్యా ఎహ్రెన్‌బర్గ్—వీరందరిలో ఎంతో వైవిధ్యం ఉన్నా, సామ్యవాద వాస్తవికతారీతి ద్వారా వారంతా ఏకమవుతున్నారు.

ఇలా ఇంకెన్ని ఉదాహరణలనైనా ఇవ్వగలను. నామనస్సుకు తట్టిన మొట్టమొదటి పేర్లను మాత్రమే వ్రాశాను. సోవియట్ సాహిత్య వ్యతిరేకులు తరచు, సోవియట్ సాహిత్యంలో విభిన్న సాహితీరీతులు లేవనీ, అంతా "మట్టం చేయబడుతుందనీ, అంతా ఒకేలాగ ఆలోచించేట్టు నిర్బంధింపబడుతున్నారనీ నేరారోపణలు చేస్తుంటారు. కాని వీరు సామ్యవాద వాస్తవికత ప్రతిభా వికాసానికి అపారమైన అవకాశాలను కల్పిస్తుందన్న విషయాన్నీ. సాహిత్యం, కళల అభివృద్ధికి కళాకారుల మధ్య సృజనాత్మకమైన పోటీ అత్యవసరమని భావిస్తున్నదన్న విషయాన్నీ మరిచిపోతున్నారు.





# స్ఫూర్తివంతమైన కళ

## వెయిస్ కుర్బనోవ్

ఇది ఆల్మా-ఆతా సంగీత నాటకశాల....

తెరఎత్తేసరికి ఒక గ్రామవృశ్యం కనుపిస్తుంది. ఒకమూలన, యువజనులు, ఒక వృద్ధ కవిచుట్టూ గుమిగూడివున్నారు. కిన్నెర తంతులు మీటుతూ, నరసిన గడ్డంతోవున్న ఆవృద్ధకవి, హంస సరస్సుకు సంబంధించిన ఒక పురాణ గాధను ఆలాపిస్తున్నాడు. ఏటా హంసలు, ఆ సరోవరానికి వచ్చి



"కారా జోర్గా"-కజఖ్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ ప్రభుత్వ సంగీత నృత్య బృంద నటీమణులు. జడ్. రజముహమెదోవా. ఎం. వాలియేవ్‌లు ప్రదర్శించిన ఒక జానపద నృత్య దృశ్యం.

★

"కారాజోర్గా"-కజఖ్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ ప్రభుత్వ సంగీత నృత్య బృందం ప్రదర్శించిన ఒక జాతీయ నృత్య దృశ్యం.

★

కజఖ్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్ ప్రభుత్వ సంగీత నృత్య బృంద నర్తకీమణులు



పాలుతుంటాయి.

....ఆ హంసల ధవళ పక్షాలు, సొగసైన వాటి గ్రీవాలు, స్వర్ణకిరీటాలు, సరోవరపు విర్మల వినీల జలోపరితలాన ప్రతిబింబిస్తున్నాయి. అవి సరోవరపులోతులోతులకుపోయి, కలువలను తాకీతాకనట్లు తాకి. మళ్ళీ ఒడ్డుకు వస్తున్నాయి. అంతలో ఆ హంసలు రూపాలు మార్చుకొని, అందమైన కన్యలైనాయి. ఒక మనోహర రాగాన్ననుసయిస్తూ ఆ రమణీ మణులు నృత్యం చేస్తున్నారు.

కవి పాట నాపేశాడు. నిశ్చల నిశ్శబ్దతలో కిన్నెర తంత్రీస్వానం వినా మరేదీ వినిపించడంలేదు. కవి, కవిసాన్నిధ్యంలో హంసాంగనలు నృత్యం చేస్తున్నారు. ఆ కన్యల ఉంగరాలజుట్టు గాలిలో వంకులొంకులుగా తారాడుతున్నది. ఆ కన్యల సిత సితాంబరాలు లోయపైని గంగరావిచెట్లమీద తారాడు తున్నాయి. వాళ్ళు వేసుకొన్న పొట్టిపొట్టి జాకెట్లమీద, తెల్లతలపాగాలమీద కోసుటోపీలపైన బంగరు కాంతులు మిలమిల్లాడుతున్నాయి.

ఆ హంస కన్యల అవ్యాహతోత్కంఠ, సంగీతంలో ప్రస్ఫుటమవుతున్నది. ఆ కన్యల లలిత లలితలాస్యం సుందరంగా వున్నప్పటికీ సహజ స్వభావానుగుణంగా ఉజ్వలమైవున్నది.

ఒక్కుమ్మడిగా తరంగితమైన హర్షధ్వానాలమధ్యన, మంత్రముగ్ధుడైన ప్రేక్షకుడు, ఇప్పటివరకూ మనం చూచినది, సుయ్యత్ అబుసైతోవ్ "దేవలోకం"లో నుంచి, కజఖ్ రిపబ్లిక్, ప్రభుత్వ నృత్యగాన బృందం ప్రదర్శించిన ఒక దృశ్యమని తెలుసుకుంటాడు.

కజఖస్తానమంతటా ప్రఖ్యాతి నార్జించుకొన్నది ఈ బృందం. ఈ బృందం సాధించిన విజయాలను గురించి విననివారంటూ రిపబ్లిక్కులలో ఉండరు. ఒక్క ప్రదర్శనశాలలోనేగాక, ఈ బృందం రేడియో కార్యక్రమాలలోసైతం పాల్గొంటుంటుంది. సంచార ప్రదర్శనలిస్తూ ఈ బృందం, సమిష్టిక్షేత్ర కర్షకులకు, నిర్మాణస్థావరాలలోని కార్మికులకు బొగ్గుపనివారలకూ హృదయాహ్లాదం కలిగిస్తున్నది. దేశంలోని బీడుభూముల సాగుబడికి తెస్తున్న ఐచ్ఛిక సేవకులు, ఈ బృందపు అభిమాన ప్రేక్షకులు.

కజఖ్ జానపద గీతాలకూ, నాట్యాలకూ సహజమైన శయ్యా, సౌష్టవాలున్నాయి. అదే వాటి విశిష్టత, ప్రత్యేకత, బృందం, అది రూపొందడం, కజఖ్ ప్రజాకళలో ఒక నవ వికాసమే అయినప్పటికీ, తీరుతీరుల కజఖ్

'కొక్పార్', కజఖ్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ ప్రభుత్వ సంగీత నృత్య బృంద నటీమణులు ప్రదర్శించిన ఒక జాతీయ క్రీడ



సంగీత, నృత్యరూపాలను, అమూల్యమైన వాటన్నిటినీ రానున్న తరాలకు పదిలపరచి యివ్వడానికి బహుళ ప్రయత్నం చేస్తున్నది. అంతేకాదు. బృంద ప్రధాన కర్తవ్యాలలో ఒకటి, నవీనకళా రూపాలను సృష్టించి జాతీయ కళలను పెంపొందించడం. బృంద నేత, లిదియా చెర్నషోవా. దానిని బృందం ప్రధాన ధ్యేయంగా పరిగణిస్తున్నారు. తమ కళారూపాలను సుసంపన్నం చేయడానికి సృజనాత్మక బృంద కార్యక్రమాలను సుసంపన్నం చేయడానికి బృందం, నవీన భావాలను సంలీనం చేసుకొని, ఈ కృషిలో రిపబ్లిక్కు నందలి విశిష్ట స్వరకారుల, రచయితల, కళాకారుల సహాయ సహకారాలను పొందుతుంది. ఈ సహకార ప్రతిఫలంగానే, బృందం, ఎన్నో గణనీయమైన కళా రూపాలను, విశిష్ట సంగీత, నృత్య నాటకానుకరణలను ప్రవర్తించగలిగింది.

కజఖ్ జానపద సంగీత సౌందర్యాలను అభివర్ణిస్తూ ప్రసిద్ధ ఫ్రెంచి రచయిత రొమేయిన్‌రోలాండ్, అతికినట్టు అవి, "స్టెప్పీలకు సహజ భూషణాలైన విరుద్ధ, విస్ఫుర రాగ మంజరు"లన్నారు. ఈ జానపద సంగీతాన్ని విన్న వారందరూ ఈ అభిప్రాయంతో ఏకీభవిస్తారు.

కళా పునరుజ్జీవనానికీ, విశిష్ట కళారూపాల సృష్టించడానికీ, ప్రజల సాంస్కృతిక జీవితాన్ని సుసంపన్నం చేయడానికీ ఈ బృందం అపారకృషిచేస్తున్నది.

## మహత్తర భవిష్యత్తుగల మన స్నేహం

(6వ పుట 1వకాలం తరువాయి)

తర కార్యక్రమాలను సుసాధ్యంచేసిన, ప్రతివీ మానవసేవకు వినియోగపడేటు చేసిన ఆ అపూర్వ కార్యకౌశల్యం.

భారత సోవియట్ దేశాల స్నేహ సంబంధాలను పటిష్ఠం చేసినవాటిలో గురుతరమైంది భారత ప్రధాని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ సోవియట్ దేశ పర్యటన. కజఖ్‌స్తాన్ ప్రజలు, ప్రధానికి, తమ దేశ ముఖ్యపట్టణంలో ఘనమైన స్వాగతం యిచ్చారు. ఆయన ఆగమనం, ఒక అపూర్వ సంఘటనగా ప్రాముఖ్యం వహించింది.

ఈ ఉభయ దేశాల ప్రజలమధ్య మైత్రిని పటుతరం చేసిన మరొక ఘట్టం. ఉపాధ్యక్షులు శ్రీ ఎస్. రాధాకృష్ణన్ కజఖ్‌స్తాన్ పర్యటన. ఆయన, మా ప్రజలు ఆర్థిక, సాంస్కృతిక రంగాలలో సాధించిన ప్రగతిని ప్రశంసించారు. "కజఖ్‌స్తాన్ భౌగోళికంగా భారత దేశానికి ఎంత సన్నిహితంగావుందో మానసికంగానూ అంత సన్నిహితంగా ఉంది,"అని ఆయన, కజఖ్‌స్తాన్ రిపబ్లిక్ సుప్రీం సోవియట్ అధ్యక్షులు జి. తషెనెవ్ ఇచ్చిన స్వాగతోపన్యాసానికి సమాధానమిస్తూ చెప్పారు. "మన కెన్నో సారూప్యతలున్నాయి. ఒక్క తరంలో మీరు మీ రిపబ్లిక్కును సుసంపన్నంగా వర్ధిల్లజేయగలగడం, అందరికీ ఆదర్శప్రాయకమవుతున్నది.

భారత దేశపు ప్రాచీన సంస్కృతి; కళ; రమణీయదృశ్యాలు; యీనాడు, మహత్తర నిర్మాణంలో, ఒక స్వతంత్ర వ్యవస్థను రూపొందించుకొని పటిష్ఠం చేసుకొనడంలో నిమగ్నమైవున్న ప్రజ్ఞావంతులైన ఆ దేశ ప్రజ అవి, భారత దేశం పట్ల మా ప్రజల ప్రేమాభిమానాల చూరగొంటున్న ప్రధాన విషయాలు.

ప్రసిద్ధ రచయిత, ముఖ్తార్ ఔజోవ్, భారత దేశ పర్యటనానంతరం, పరంపరగా తన అనుభవాలగూర్చి ప్రసంగాలు చేశారు. "భారత దేశాన్ని గురించి" అనే ఒక గ్రంథం రచించారు. ఇతర విషయాలతోపాటు ఆయన : "సోవియట్ సాంస్కృతిక ప్రతినిధి వర్గ సభ్యులమైన మేము, మా వీక్కోలు సందర్భంగా, మనః పూర్వకంగా ప్రధాని నెహ్రూ చెప్పిన మాటల్ని ఎన్నటికీ మరచిపోలేము. మా ప్రాతినిధ్య సందర్భంగా, ఆయన, సౌహార్ద్రిత సౌహార్ద్రిరను, స్నేహం స్నేహాన్ని ప్రతిరూపింపజేస్తాయి, జాతుల మధ్య ఇటువంటి గురుతర సంబంధాలను పెంపొందింప జేయడం కన్న ఉదాత్తమైన దౌత్యం మరొకటి లేదన్నారు."

గడచిన కొలది సంవత్సరాలలో, భారత దేశ ఛాయాచిత్ర ప్రదర్శనలు రెండు జరిగాయి. ఒకటి, "భారత దేశం గుండా," రెండవది, "భారత వాస్తుశిల్పం, కళ." ఈప్రదర్శనలను మా ప్రజలు సముత్సుకతతో సందర్శించారు. ఇవి భారత జీవితాన్ని, సంస్కృతిని గురించి తెలుసుకోవాలన్న ఆకాంక్షను సంతృప్తిపరచి, అనల్ప సహాయం జేశాయి.

కాళిదాసు, రవీంద్రనాధ టాగూర్ మొదలైన భారత మహాకవుల కావ్యాలు; ముల్కరాజ్ ఆనంద్, ప్రేంచంద్ మొదలైన ఆధునికుల సాహిత్యం, వివిధ వర్గాలకు చెందిన కజఖ్ ప్రజల అందుబాటులోకి తీసుకరాబడ్డాయి. నాకుకూడా, కజఖ్ భాషలోకి ప్రేంచంద్ కధలను అనువదించే అపూర్వావకాశం లభించింది.

ప్రజ్ఞావంతులు, శాంతిప్రియులైన ప్రజలతో, ఉజ్వల భవితవ్యాన్ని కలిగివున్న భారత దేశపు మైత్రి, నిజానికి మాకెంతో అమూల్యమైంది.

## ప్రపంచ యువజనోత్సవం

(21వ పుట తరువాయి)

ఆర్థిక విషయాలపై విద్యార్థిలో యెంతో ఆసక్తి కలిగించింది, సోవియట్ యూనియన్‌లో ఆర్థిక శాస్త్ర విద్యాపద్ధతి గురించి ఎన్నో విషయాలు తెలిసి కౌతుకం కలిగించే చర్చ జరిగింది. సోవియట్ యూనియన్‌లో ఆర్థిక విషయాల బోధన, వాస్తవ జీవితంలో ప్రమేయం లేనట్లు వేరుగా విడదీసి వుండదు. ఆసక్తి, కుతూహలం కలిగించని పాఠంగా వుండదు. రష్యాలో విప్లవానికి పూర్వం, పెట్టుబడిదారీ పద్ధతీ పెత్తందారీ భూస్వామిత్వం వుండిన ఆర్థిక వ్యవస్థను శోషరహిత వ్యవస్థగా మార్చివెయ్యాలన్న, నిర్దేశిత లక్ష్యంతో ఆర్థిక శాస్త్రబోధన ప్రకాశితా బద్ధంగా జరుగుతోంది.

మాస్కో మహోత్సవంలో భారతదేశ ప్రతినిధులు, తమను తాము అభినందించుకునేందుకు కొన్ని నిజమైన హేతువులున్నాయి. ఒక రాత్రి జరిగిన భారతీయ సాంస్కృతిక ప్రదర్శనని కొక్కడానికే, సోవియట్ అధ్యక్షవర్గం సందర్శించిన గౌరవం లభించింది. భారతీయ నృత్యాలూ, ప్రదర్శనలూ, సర్వజన హర్షామోదాలు పొందాయి. మాస్కో నగరవాసులు, వీధులలో సంచరిస్తున్న భారతీయులమీద చూపిన ప్రేమానురాగాలు పారవశ్యం కలిగించాయి. రష్యా ప్రజలు, మనోభావ దీప్తి గలవారు. సోవియట్ నాయకులు బుల్గానిన్, కృశ్చెవ్ భారతదేశం సందర్శించినప్పుడు భారత ప్రజానీకం ఇచ్చిన గొప్ప స్వాగత సన్మానాలను సోవియట్ పౌరులు డాక్యుమెంటరీ చిత్రాలలో చూడటంవల్ల, భారతదేశమూ, భారతీయులూ, వారి హృదయాలకి మరింత సన్నిహిత మవటం జరిగింది.

మాస్కో సందర్శించిన వివిధదేశాల ప్రతినిధివర్గాలూ, విశాల హృదయం ఉదార బుద్ధిగల మాస్కో నగరవాసులకి ధన్యవాదాలర్పించాలి. వారు, మాస్కో సందర్శించినవారిని, మైత్రీ ప్రేమలతో నిండిన మహా సముద్రంలో మునకలు వేయించారు.

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖ తరఫున, జి. ఎఫిమోవ్ చే 25, బారాకంబా రోడ్, న్యూ ఢిల్లీ నుంచి సంపాదితము, ఎన్. కె. దొరాద్నిత్సిన్ చే ముద్రితము, ప్రచురితము. ముద్రాపకులు : పంజాబి ప్రెస్, సదర్ బజార్, ఢిల్లీ-6.



పాత ఢిల్లీలో


పాతఢిల్లీలోని ఒక వీధి

# భారత దేశ పర్యటనానంతరం

అజర్ బైజాన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్‌కుచెందిన తైలవర్ణ, రేఖా చిత్రకారుడు మిఖైల్ అబ్దుల్యేవ్, ఎన్నో చిత్రాలను రచించి విస్తృత విఖ్యాతి నార్జించుకున్నాడు. ఈ చిత్రకారుడు, సోవియట్ దేశ కళా ప్రదర్శనలలో పాల్గొన్నాడు. 'మినైచౌర్ దీపాలు' అన్న యీయన చిత్రరచన హంగరీ, అంతర్జాతీయ ప్రదర్శనలలో ప్రదర్శితమైంది. అబ్దుల్యేవ్, "ఈ దక్షిణాదిన" అన్న చిత్రం, మా దేశంలో సుప్రసిద్ధమైనది ఇప్పుడు భారతీయు లందరికీ సుపరిచిత మైనదే. భారతీయ నగరాలలో 1951లో జరిగిన సోవియట్ కళా ప్రదర్శనలలో ఇది ప్రదర్శితమైంది.

ఇటీవల, యీ చిత్రకారుడు, మూడు నెలల పాటు భారతీయ నగరాలు-ఢిల్లీ, కలకత్తా, జైపూర్, ఆగ్రాలలో పర్యటించి వచ్చారు. తనవెంట నూరింటికి పైగా సామాన్య భారత ప్రజాజీవితాన్ని చిత్రించే స్కెచ్చిలను, పోర్ట్రయిట్లను, ప్రకృతి దృశ్యాలను, ప్రయాణ చిత్రాలను తీసుకవచ్చారు. ఇక్కడ వారి చిత్రాలనుండి కొన్నింటిని ప్రచురిస్తున్నాము.


మురళీ విక్రేత


వంగ వనితలు


కుతుబ్ మినార్ దగ్గర

